శ్రీరస్తు.

# పారిజాతాపహరణము

నంది. తిమ్మయవిరచితము








చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము

1929



# ప్రస్తావన.

ఆంధ్రకావ్యరత్నములలోఁ బారిజాతాపహరణ మొక యమూల్యరత్నము. దీనిని నంది తిమ్మన యనుమహాకవి రచించెను. ఇతఁడు హూణశకము 1509 సం॥ మొదలు 1530 సం॥ వఱకు నాంధ్రభోజుఁడని ప్రఖ్యాతినిగాంచి యాంధ్రరాజ్యమును బాలించిన శ్రీకృష్ణదేవరాయలకు నీకావ్యమును గృతి యిచ్చినందున నతనియాస్థానవిద్వత్కవిరత్నము లగు నల్లసాని పెద్దనాదులలో నొకకవిరత్న మనియు నతనికి సమకాలికుఁ డనియుఁ దేటపడుచున్నది. ఇతఁడు పారిజాతాపహరణమునే కాక త్రిస్థలీదండకము నొక దండకమునుగూడ రచించెను.

ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; కౌశికగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; నందిసింగనకును దిమ్మాంబకును బుత్త్రుఁడు; *మలయమారుతుఁ డనుకవికి మేనల్లుఁడు; † అఘోరశివగురువు శిష్యుఁడు; శ్రీకృష్ణదేవరాయలు తన కవితామాధుర్యమునకు మెచ్చి యనేకాగ్రహారముల నొసంగి సత్కరించినట్లు తనగ్రంథముననే జెప్పికొని యున్నాఁడు (పారి. ఆ. ౫. ప. ౧౦౮).

జగత్ప్రఖ్యాతకీర్తియగు శ్రీకృష్ణదేవరాయఁడు ప్రతిసంవత్సరము వసంతోత్సవమును జేయుచు భోజుఁడువలె ననేక

* ఈమలయమారుతునివృత్తాంత మేమియుఁ దెలిసినది గాదు; కాని సకలవిద్యాచతురుఁ డనిమాత్రము ఆంధ్రప్రబోధచంద్రోదయమునఁ జెప్పఁబడినది. † ఇతని వృత్తాంతము విచార్యము.

కవులను దేశదేశములనుండి రప్పించి కవితాశక్తిని బరీక్షించి తనివిదీర ధనకనకాదులచే వారిని బూజించుచుండువాఁడఁట. (పారి. ఆ. ౧. ప. ౧౩౯) ఈరాజన్యునియాస్థానమునం దష్టదిగ్గజములని ప్రసిద్ధివడసిన మహాకవులలో నల్లసాని పెద్దనయందును నందితిమ్మనయందును గృష్ణదేవరాయలకు మిక్కిలి ప్రేమయు విశ్వాసమును గలిగియుండెనని చెప్పుదురు.

తిమ్మకవి యీకావ్యమును రచించుటకు హేతువు.— కృష్ణదేవరాయలు ప్రియురాలితోడి ప్రణయకలహములయందుఁ దనకు భార్య యొనర్చినయవమతికిఁ గోపించి విరసుఁడై యుండ నాతనికోపము దీర్పఁదలఁచి కావ్యమును రచించుట యనుమిషఁ బెట్టికొని నాయికానాయకుల రహస్యభావముల నతనికి వెల్లడింపఁ గోరి:—

ఉ. "పాటలగంధి చిత్తమునఁ... మ్రొక్కినన్." (ఆ. ౧. ప. ౧౨౦.)
మ. "జలజాతాసనవాసవాదిసుర... సేర్తురే." (ఆ. ౧. ప. ౧౨౧.)
చ. "ననుభవదీయదాసుని మనంబున...నరా[illegible]. (ఆ. ౧. ప.౧౨౩.)

అను తేనె లొలుకు తియ్యనిముద్దుపద్యముల నల్లి శ్రీకృష్ణసత్యభామాశృంగారకేళీవిలాసవర్ణనావ్యాజమునఁ గృష్ణదేవరాయలకు సూచించె ననియు, భావజ్ఞుఁడగు నతఁడు కవిసూచన నెఱింగి సిగ్గుపడి "రహస్యస్థలములఁ బ్రియులు ప్రియురాండ్రచేఁ బ్రధర్షితులగుట రసికజనసాధారణ" మని భావించి యదిమొదలు ప్రియతమయందుఁ దొల్లిటికన్నఁ బ్రేమానుబంధమున మెలంగె ననియు నీకథను గొందఱు చెప్పుదురు;* కాని యిది యంత విశ్వసనీయముగఁ దోఁపలేదు. ఏలయనఁ మహాకవి సార్వభౌముల నసం

* ఈచరిత్ర గురుజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితములలో విపులముగ వర్ణింపఁబడియున్నది.

ఖ్యుల నతిప్రతిభాశాలుర నాస్థానమున నెలకొల్పుకొని యాంధ్ర కవితాసామ్రాజ్యమునఁ బట్టభద్రుఁడై చిత్రవిచిత్రవర్ణనలతో నవరసాలంకారాలంకృతం బగునాముక్తమాల్యదను రచించు నంతటికవితాప్రాభవము గలిగి రసికశిఖామణి యైనకృష్ణరాయ కవీంద్రున కింతటి శృంగారరసస్వరూపము దెలియకుండునా? అతఁడేమి నాయికానాయకశృంగారవిలాసరహస్యముల నెఱుం గనివాఁటుమానిసియా? అది యట్లుండ రహస్యస్థలమగు నంతః పురమునఁ గృష్ణదేవరాయలు ప్రణయకలహాసందర్భమునఁ గోపించినవృత్తము తిమ్మకవి కెట్లు తెలియును? ఇట్టివిషయముల నాయిక గాని నాయకుఁడు గాని మిత్రజనముతో నైనఁ జెప్ప సాహసించునా? కాఁబట్టి యిది యసంభావనీయము. విమర్శించు కొలఁది నాభాసపాత్రము. కావ్యకరణమునకు రాజప్రేరణయు నిజకవితాప్రాగల్భ్యమును మున్నగునవి హేతువు లగును గాని, యిట్టి యసందర్భములుగావని కొందఱు తలంచుచున్నారు; కాని,తిమ్మకవి తిరుమలదేవి యరణపుకవియైనందున స్వాతంత్ర్య ముచే నీవృత్తాంత మతనికి రహస్యముగఁ దెలిపియుండవచ్చును గాన నిదియు సమంజసమే యని మఱికొంద ఱనుచున్నారు.

మఱియొకవిషయము.—

ఈకవి నందితిమ్మన గదా! ముక్కుతిమ్మన యనుప్రసిద్ధి యెట్లు గలిగెను? ఇతఁడు ముక్కును—

శా. నానాసూనవితానవాసనల నానందించుసారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాఁకం దపం బంది యో
షానాసాకృతిఁ బూని సర్వసుమన స్సౌరభ్యసంవాసి యై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబులిర్వంకలన్ (వసు. ఆ. ౨. ప. ౪౭.)

అని విచిత్రముగ వర్ణించెననియు, ఇద్దానిని నన్నూరు వరాలకో నాలుగు వేలవరాలకో కొని రామరాజభూషణుఁడు (భట్టు మూర్తి) తనవసుచరిత్రలోఁ దగిలించుకొనెననియుఁ జెప్పుదురు. నవనవవర్ణనావైచిత్ర్యశోభితమై కావ్యరత్నమనఁదగువసుచరిత్రను రచించినమహాకవి యింతటివర్ణన గలపద్యమును రచింపలేకపోవునా? ఒకవేళ నట్టియన్యాదృశమగువర్ణనతోఁచకపోయినను లాఁతికవి యొనర్చినపద్యమును సిగ్గుమాలి కొని తనగ్రంథమున వేసికొనునా? ఇట్టి యసంభావితములు ప్రాకృతులకుఁ దక్క విమర్శకులగు పండితులకు నాదరణీయములుగావు. కాఁబట్టి ముక్కుతిమ్మన యనునది చిన్నతనమునుండి యనువర్తించినవాఁడుకపేరు గాని నడుమంత్రమున వచ్చినది గాదు. ఇతనికి 'ముక్కు' అనునది ముక్కును వర్ణించినందున వచ్చినబిరుదనామమగునేని గ్రంథమునఁ జెప్పికొనియే యుండును. అట్లు చెప్పికొనమిచే, నితనికిముక్కు పొడవుగ నున్నందునఁ జిన్నతనముననే ముక్కుతిమ్మనయని యంద అనుచుండిరనియు, పెద్దవాఁడైనపిదపఁ గూడ నది యనువర్తించుచుండెననియుఁ జెప్పుట సమంజసమని తోఁచుచున్నది. ఈకాలమందును నిట్లు 'పప్పు దంచయ్య', 'అన్నం కిచ్చయ్య' మొదలగు పేరులను మనము వినుచున్నాము గదా! ఇఁక ప్రకృతమ్మనుసరింతము.

"ముక్కుతిమ్మనార్యు ముద్దుఁబల్కు" అనుమాట యందఱెఱింగినదే. అతనికవితాచమత్కృతియు వర్ణనాసందర్భంబును మృదుమధురపదగుంభనంబును నతని గ్రంథముఁ బఠించిన సహృదయుల హృదయంబుల కెఱుకపడనివి గావు. కావుననే యాంధ్రవాఙ్మయమునఁ బ్రౌఢకవివిరచితము లగు కావ్యము

లలో ముక్కుతిమ్మన పారిజాతాపహరణము నొకదానిఁగఁ బరిగణించుటయే కాక యన్ని కావ్యములకన్న నిది మిక్కిలి సరస మనియు సరళ మనియుఁ బెక్కుపండితులు వక్కాణించు చున్నారు. కావుననే యొకకవి—

క. "లోకమునం గలకవులకు
నీకవనపుఁ దీవి యబ్బునే కూపనట
ద్భేకములకు గగనధునీ
శీకరములచెమ్మ నందిసింగయతిమ్మా".

అని కొనియాడెను. అగుట సర్వరసికజనతాహృదయముల నయ స్కాంతము లోహమునుబోలెఁ దటాలున నాకర్షించునిరతి శయప్రభావము గలసౌందర్య మీతనికావ్యమునకుఁ గల దని యూహింపవలసియున్నది. ప్రాణిసమూహ మంతయు సౌందర్య మును జూచియేకదా యేపదార్థమునం దేనియు మనమును లీనముచేసి యానందరసము ననుభవించును!. అట్లే కావ్య రసికులు కావ్యములందలి సౌందర్యమునకు (అలంకారమునకు) మోహితులై తదేకాయత్తచిత్తులై కావ్యానందము ననుభ వించుచున్నారు. అట్టియానందరసమున కాలవాలమగు సౌంద ర్యముచే నీపారిజాతాపహరణ మెంతయు నలరారుచున్నది.

ఇట్టియుత్తమకావ్యమును దిమ్మకవి,భాగవతమునందలి దశ మస్కంధములోని యేఁబదియొమ్మిదవ యధ్యాయమునందు—

"చోదితో భార్యయోత్పాట్య పారిజాతం గరుత్మతి,
ఆరోప్య సేంద్రాన్ విబుధాన్నిర్జిత్యోపానయత్పురం.
స్థాపితం సత్యభామాయా గృహోద్యానోపశోభనః,
అన్వగుర్భ్రమరాస్స్వర్గాత్తద్గంధాసవలంపటాః.

యయా చ ఆనమ్య కిరీటకోటిభిః
పాదౌ స్పృశన్న చ్యుతమర్థసాధనం
సిద్ధార్థ ఏతేన విగృహ్యతే మహా
నహో సురాణాం చ తమో ధిగార్యతాం."

అను మూఁడుశ్లోకములలో నతిలఘువుగ వర్ణింపఁబడినకథను బెంచి పెంచి 509 పద్యములు నాలుగాశ్వాసములు గల పెద్దప్రబంధమును రచించెను. దీనినిబట్టియె యితనికల్పనావైభవ మమేయమని యూహింపవచ్చును. ఇందు మూలగ్రంథమందున లేకున్నను లోకానుభవము ననుసరించి రసమును బోషించుచు "నారదుఁడు శ్రీకృష్ణునికడకు వచ్చి పారిజాతపుష్పము నొసంగుటయు, దాని నతఁడు రుక్మిణి కీయ నీవృత్తాంతము విని సత్యభామ కోపించి కాలితోఁ దన్నుటయు, ఆమెకోపముదీర్ప పారిజాతవృక్షమునే తెచ్చి యిత్తునని శపథము చేసి యామె నోదార్చుటయు, పారిజాతవృక్షమును దెచ్చి యిచ్చినపిదప నారదుఁడు మరల వచ్చి సత్యభామచేఁ బుణ్యకవ్రతమును జేయించి కృష్ణుని తోఁగూడ నాపారిజాతమును సత్యభామవలన దానముగా గ్రహించి మరల నామె కొసంగుటయు" ననుకథలను గథాచమత్కారమునకై కల్పించినాఁడు.

ఇతని కవిత్వము మృదుమధురమును సాలంకారమునై ప్రౌఢమని మాటలచే నెల్లరకుఁ బ్రయాసము లేక బోధపడు నదియై యుండును. ఈసారళ్యము రామరాజభూషణాదులకు నైన మలవడలేదని చెప్పవచ్చును.

ఇతనికి సంస్కృతాంధ్రములయందు ననుభవముతోఁగూడిన యసమానపాండిత్య ముండెనని కవితాశైలినిబట్టి

తెలిసికొనవచ్చును. ప్రాయికముగా వైయాకరణైకవేద్యము లగు, ఆముష్యాయణ, తుందపరిమృజ, సుభగంభావుక మున్నగు శబ్దములఁ బ్రయోగించుట చూడ నితఁడు వైయాకరణుఁడని యూహింపవలసియున్నది; కాని యీకాలమునుబట్టి కవికి వ్యాకరణజ్ఞానము గూడఁగలదా? యని యబ్బురంపడవలసియున్నను, ఆకాలమునఁ గవి కాఁదగినవాఁడు,—వైయాకరణుఁడే యన నేల? సర్వశాస్త్రమర్యాదలు దెలిసినవాఁడై యుండి తీర వలయునని నియమ మున్నందున తిమ్మకవి వ్యాకరణపాండిత్యమునుగుఱించి యధికముగ విచారింప నక్కఱ లేదు. కావుననే మనప్రాచీనగ్రంథము లన్నియు (200 సంవత్సరములకు ముందటివి) ప్రాయికముగ సలక్షణములై సరసములైయున్నవి ఇప్పటి కాలమున తక్కిరిబిక్కిరితడక నొకనవల నల్లినమాత్రముననే మహాకవి పదవి నందిన ట్లెంచునుగదా.

తిక్కనకవిత్వమునందుఁ బరికించి చూచిన మొత్తము మీఁద సంస్కృతపదములకన్నఁ దెనుఁగుపదములే యధికముగ నుండును. ఆతెనుఁగుపదములును వాడుకలోనున్నవై ముద్దుల మూటగట్టుచుండును. మఱియు నీకవి కవితాసందర్భమునందుఁ బ్రాయికంబుగ స్వభావోక్తి, ఉత్ప్రేక్ష, అర్థాంతరన్యాసము, ఉపమ మొదలగు ప్రసిద్ధార్థాలంకారములను, గుణితక్రమము, పాదభ్రమకము, ముక్తపదగ్రస్తము మున్నగుశబ్దాలంకారములను బొందుపఱిచియున్నాఁడు. వీని వెంటనే బంధకవిత్వము, గర్భకవిత్వము, ద్వ్యక్షరకందము మున్నగు శబ్దచిత్రములను గూడఁ గూర్చియున్నాఁడు. అచ్చటచ్చట సాత్త్వికవ్యభిచా

ర్యాది భావములను, అభిసారికాదినాయికలను మిక్కిలి సొంపు, నింపుచు నభివర్ణించియున్నాఁడు.

ఇంతియకాక సహృదయహృదయానందకరములై చమత్కారకారణములగు మనుజులస్వభావములును, స్వకార్యానుకూల్యమునకుఁ దగినయుక్తులును, ప్రోత్సాహములును నాయాచోటులఁ జిత్రముగ సమకూర్పఁబడినవి. ఉదాహరణము:—

నారదుఁడు కలహాశనుఁ డనుసంగతి యందఱెఱింగినదే కదా! ఈ 'పోరోగిరముతిండిపోతు' శ్రీకృష్ణుఁడు రుక్మిణియంతఃపురమున నున్నతఱి నచ్చటికిఁ బోయి యొకపారిజాతకుసుమమును 'మిన్నేటిపసిండినెత్తమ్మి చిగురుటాకున' ముడిచి శ్రీకృష్ణునకు సమర్పించెను. అతఁడును సత్యభామను దలంచియు బాగుగ నాలోచించి యాపువ్వును దనకడనున్నరుక్మిణి కీయకున్న నామె మనసు చిన్నవోవునని రుక్మిణికే యిచ్చెను. అప్పుడె నారదుని పన్నాగము ఫలోన్ముఖమయ్యెను. అంత నిలువక నారదుఁడు 'కలహాసంభ్రమపరుఁడై' యాపారిజాతపుష్పమును "పరిమళము సెడదు. వాడదు, పరువము దప్పదు. నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువేళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు గల్పించును. ఈకుసుమంబు గొల్చుటకై, సవతులు వచ్చి నీచరణసారసయుగ్మము నాశ్రయింతురు" అని కలహకారణములగు స్తుతివాక్యములఁ బొగడెను. అంతలో వినుచున్న సఖులు సత్యకుఁ దెలిపిరి. ఆమె "ప్రేటువడ్డనురగాంగనయుంబోలె నేయివోయ భగ్గన దరికొన్నహుతాశనకీల యనంగ లేచి, అతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణఁజేసినఁజేసెగాక యీమతకరివేల్పుందపసి మమ్ముఁ దలంపఁగనేల?" యని నారదుని దూషించి రుక్మిణిపై

నసూయపడి మగనిపైఁ గోపించి 'మానినచీరగట్టి...' కోపవేష మునుబూని యుండఁ గృష్ణుఁ డీసంగతి నూహించి యచ్చటి కేతెంచి సత్య నెన్నియోరీతుల ననునయించెను; గాని యామె కోపము పెట్టె త్తి కాళ్లమీఁదఁబడి వేఁడుకృష్ణభగవానుని శిరమునుగూడఁ గాలఁ దొలఁగం ద్రోయించెను. తుదకు సత్య భామ "పారిజాతవృక్షంబునేఁ దెచ్చి నీపెరటిచెట్టుగ నాటింతు నొక్కకుసుమమాత్రమున కిట్లువగవనగునే?"యని కృష్ణునినోట ననిపించెను. ఇఁక నేమున్నది? నారదుని కలహబీజము నాటఁబడి మొలకెత్తి చిన్నచెట్టయి మ్రానయి పూచి కాచినది. ఇచ్చటి నారదుని చాకచక్యమును జూడుఁడు. సత్యకును రుక్మిణీకృష్ణు లకును, వీరియందఱికిని లాతిదేవేంద్రులకును, గలహమును బెట్టె నుగదా! ఇంతియగాక, యింద్రాదులతోఁ బోరాడకయే పారి జాతాపహరణరూపమగు ప్రతిన యెట్లు నెఱవేఱఁగలదు? కాఁబట్టి యదియు నవశ్యభావి గాన సురలకును గృష్ణునకును గూడఁ గలహముఁబెట్టినవాఁడనియే చెప్పవచ్చును. మఱియొక చిత్రమును జూడుఁడు? రుక్మిణియెదుట సత్యభామ నెన్నియో తెఱంగుల నిందించెను గదా! వెనువెంటనే కృష్ణునితోఁ గూడి యున్నసత్యభామయింటి కేతెంచి సత్యభామాకృష్ణులచే సత్కృ తుఁడై కథుపార విందారగించి త్రేఁపులు ద్రేఁచుచు నామెకోప మును దిగఁదుడువ నెట్లు ముఖస్తుతియొనర్చెనో చూచితిరా ? (ఆ ౨. ప. ౨౮, ౨౯.) పాపము! సత్యభామ యమాయకురాలు గాన యాతనిపితలాటకమును గనుఁగొనలేక యాముఖస్తుతికి సంతసించెను.

మనబాధఁ జంతటితో నూరకుండెనాయేమి! సత్యావస రమునందే "అనికైనం బతి నిన్నుఁ బాసి చనునో" యని సాభిప్రాయముగాఁ బలికి కృష్ణునితో స్వర్గమునకుఁ గూడ వెంటఁ బడిపోవునట్లు సత్యభామను బురికొల్పెను. తరువాతఁ గృష్ణుఁడు నాకమున కేఁగి సురల జయించి పారిజాతమును దెచ్చినపిదప మరల నేతెంచి సత్యభామచేఁ బుణ్యకవ్రతమును జేయించి ప్రతిదక్షిణగా నామెవలనఁ గృష్ణునిఁ దానముగాఁ దీసికొని యతనిచే నెకఁగుసనులను జేయించి యందఱకు నవ్వును గలిగించెను.

ఇట్లు తిమ్మకవి చిత్రచరిత్రలను వర్ణించి యనుభవసిద్ధములగు లోకస్వభావములను సహృదయరంజకంబుగ వెల్లడించెను. ఇట్టి యసమానసత్సౌందర్యముచే నలరారు నిమ్మహాకావ్యము నాంధ్రవిద్వల్లోకమునకుఁ బ్రసాదించి కీర్తిశరీరుఁడై రసికాగ్రణులహృదయసౌధముల విహరించు తిమ్మకవి యశోవాంధ్ర కంఠీరవజనకానామాన్యమునకు నమసీయుఁడని నొక్కి వక్కాణించుచు విరమించుచున్నాఁడను.

చెన్నపురి. 25-4-18. } ఉత్పల. వేంకటనరసింహాచార్యులు.



శ్రీ ర స్తు.

# పా రి జా తా ప హ ర ణ ము

## పీ ఠి క.



మదికిం బ్రియం బెసఁగఁ
జేర్చినయుయ్యెలపట్టె వైజయం
తీమిళితాచ్ఛకౌస్తుభము
నిద్దపుఁగాంతిఁ దనర్చు యాత్మవ
క్షోమణివేదిఁ బొల్పెసఁగఁ
జూడ్కుల కింపొదవు సేయు వేంకట
స్వామి కృతార్థుఁ జేయు నర
సక్షితినాథునికృష్ణరాయనిన్. 1

మ. పొలఁతు న్గౌఁగిటఁ గ్రుచ్చి యెత్తి తలఁబ్రా లోయించు
నవ్వేళ న్ముత్తెల గంగం దనసిడఁ దానకని మౌగ్ధ్యంబొప్ప
నే అక్కతో, య్యాలి యంచు న్మది నెంచుపార్వతియసూ
యావాప్తిఁ జిక్కి న్నవక్రొ, న్నెలపూఁదాలుపు కృష్ణరాయనికి
సంధించు న్మహైశ్వర్యముల్. 2

మ. తనవంతాగ్రముచేతఁ దీక్ష్ణమతి యుద్యత్తుంభయుగ్మంబుచే
త నితాంతోన్నతిదానవిస్ఫురణనుత్సాహంబుసుంధాముఖం
బున దీర్ఘాయువు నిచ్చుఁ గావుత గుణాంభోరాశికిం గృష్ణరా
యనికి న్వారణరాజవక్త్రుఁడు కృపాయత్తైకచిత్తాబ్జుఁడై.

చ. సరసపుటల్కఁ దీర్చుతఱి శార్ఙ్గసుదర్శననందకాబ్జసం
భరణగుణాప్తి నెన్నడుముపైఁ గటిపై జడపై గళంబుపై
హరినలుగేలుఁ బైకొన సుఖాంబుధి నిచ్చలు నోలలాడునిం
దిర కృపఁ జూచుఁ గాత నరదేవశిఖామణి కృష్ణరాయనిన్.

చ. తన మృదుగీతికాపరిణతధ్వని వైఖరిఁ బల్కు మంచు మిం
చినరహిఁ జేతివీణియనుఁ జెక్కులు గీఁటుచు నేర్పుచున్నదో
యన నఖరాంకురంబులనయమ్మునఁ దంత్రులు మీటి గానమిం
పొనరఁగఁ జేయు వాణి ప్రతిభోన్నతుఁ జేయుతఁ గృష్ణరాయనిన్.

చ. వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించినపూవుగుత్తి వే
ల్పులగమిజీవగఱ్ఱ యుడివోవనిచల్వలపెంకి వెన్నెల
ల్మొలచినపాదు పాల్కడలిముద్దులపట్టి నృసింహకృష్ణరా
యలఁ గరుణారసంబునినుపారెడిచూపులఁ జూచుఁగావుతన్.

## కృతిపతివంశావళి.

ఉ. ఆయమృతాంశువందు నయమయ్యె బుధుండతఁ డార్తరక్షణో
పాయుఁ బురూరవుం గనియె నాతనికాయువు పుత్త్రుఁడయ్యె న
య్యాయతకీర్తికిన్ నహుషుఁ డాత్మజుఁడై యిలయేలెఁ దత్సుతుం
డై యలరెన్ యయాతి యతఁ డాహవదోహలుఁ గాంచె దుర్వసున్.

క. ఉర్వీశమౌళి యగునా, తుర్వసువంశంబునందు దుష్టారిభుజా
దుర్వారగర్వరేఖా, నిర్వాపకుఁ డీశ్వరాఖ్యనృపతి జనించెన్.

ఉ. తామసవృత్తి లేదు సతతంబును నుగ్రుఁడు గాఁడు పౌరుషం
బేమియు వెల్తిగాదు తన కెందును బైమఱి రాజు లేఁడు సం
గ్రామములోన నొక్కనరుగానికి వాసి దొఱంగఁ డీశ్వర
క్ష్మామహిళామనోహరుని సాటియె యీశ్వరుఁ డెన్ని భంగులన్.

ఉ. రాజులనెత్తుటం బరశురాముఁడు వ్రంతలు సేసె రెండుమూఁ
డీజగతిం గణింప నది యెంతటివిస్మయ మబ్జినీసుహృ
త్తేజుఁడు కందుకూరికడఁ దిమ్మయయీశ్వరుచే జనించె ఘో
రాజి బెడందకోట యవనాశ్వికరక్తనదీసహస్రముల్. 10

క. శాశ్వతవిజయుఁడు తిమ్మయ
యీశ్వరనృపతికిని గౌరి కెన యగుతత్ప్రా
ణేశ్వరి లక్కాంబికకు
న్విశ్వాతిగయశుఁడు నరసవిభుఁ డుదయించెన్. 11

సీ. ఎవ్వానివిజయంబు లెఱిఁగించు శాసన
స్తంభంబు లాశాంతశైలవితతు
లెవ్వానియరిగాఁపు లేపారు కాళింగ
యవనాదివివిధదేశాధినాథు
లెవ్వానినిత్యదానైకవిలాసంబు
లారూఢతరతులాపూరుషంబు
లెవ్వానిచిరకీర్తి యింద్రలోకాంగనా
భోగినీగీతికాభోగపదము
తే. వాఁడు వొగడొందు సర్వసర్వంసహాధి
దేవతాముఖదర్పణద్విజయనగర
భద్రసింహాసనస్థుఁ డున్నిద్రతేజుఁ
డీశ్వరాధిపునరసభూమీశ్వరుండు. 12

సీ. కుంతలేశ్వరుఁడు సిక్కువడంగ విద్యాపు
రంబు గైకొని నిజప్రౌఢి నెరపెఁ
బారసీకునకు దుర్భరమానవత్వంబుఁ
దొలఁగించె మానవదుర్గసీమఁ

జోళవల్లభునకు సురవధూమధురాధ
రము లిచ్చి మధురాపురంబుఁ గొనియె
శ్రీరంగపట్టణసీమ ఖడ్గనటీవి
నోదంబు హైసణేంద్రునకుఁ జూపె
తే. నతఁడు నుతి కెక్కె హైమమనేత్వంతరాళ
కలితషోడశదానవిఖ్యాతయశుఁడు
మండలీకరమేఘమారుతాండబిరుదుఁ
డీశ్వరాధిపునరసపృథ్వీశ్వరుండు. 13

క. ఆనరసమహీమహిళా
జానికిఁ గులసతులు పుణ్యచరితలు తిప్పాం
బా నాగాంబిక లియవురు
దానవదమనునకు రమయు ధరయును బోలెన్. 14

క. వారలలోఁ దిప్పాంబకు
మారుఁడు పరిపంథికంధిమంథాచల మై
వీరనరసింహరాయఁడు
వారాశిపరీతభూమివలయం బేలెన్. 15

కృష్ణదేవరాయవర్ణనము.

శా. వీర శ్రీనరసింహశౌరిపిదప న్విశ్వక్షమామండలీ
ధౌరంధర్యమునకు జనంబుముదమందన్నాగమాంబాసుతుం
డారూఢోన్నతిఁ గృష్ణరాయఁడు విభుండై రాజ్యసింహాసనం
బారోహించెవిరోధులున్నహనశైలారోహముం జేయఁగన్.

సీ. యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి
సింహాసనస్థుఁడై చెన్ను మెఱయ

గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁజేసి
పరకామినీసహోదరతఁజూప
మఱి జరాసుతునకై మథుర డించుటఁజేసి
పరవర్గదుర్గము ల్బలిమిఁ గొనఁగఁ
బారిజాతము నాసపడి పట్టి తెచ్చుట
నౌదార్యమున దాని నడుగువఱుపఁ
తే. గోరి తొలుమేనఁ దన కైనకొదువ లెల్ల
మాన్చుకొన వచ్చి భువనైకమాన్యలీల
నవతరించినకృష్ణుఁడౌ ననఁగ మించె
నరసవిభుకృష్ణరాయభూనాయకుండు. 17
శా. శ్రీరంగేశ్వరనాభిపంకజరజశ్శ్రీకంటెఁ జోటీంద్రత
న్వీరాజత్కుచపాళి*కుంకుమముకంటె న్సహ్యభూభృత్తటీ
నీరంధ్రీకృతగైరికద్రవముకంటె న్వన్నె గావించెఁ గా
వేరీతోయముఁ గృష్ణరాయఁ డహితోర్వీనాథరక్తప్రభన్.
సీ. చక్రవర్తిమహాప్రశస్తి నాఁడును నేఁడు
చెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె
భూభృదుద్ధరణవిస్ఫూర్తి నాఁడును నేఁడు
గోరక్షణఖ్యాతిఁ గుదురు పఱిచె
సాధుబృందావనసరణి నాఁడును నేఁడు
వంశానురాగంబు వదలఁడయ్యె
సత్యభామాభోగసక్తి నాఁడును నేఁడు
నాకల్ప మవని నింపార నిలిపె
తే. నాఁడు నేఁడును యాదవాన్వయమునందు
జనన మందెను వసుదేవమనుజవిభుని

* 'మంజరులకంటె' అని యొకపాఠము.

కృష్ణుఁ డను పేర నరసేంద్రు కృష్ణదేవ
రాయఁ డను పేర నాదినారాయణుండు. 1

చ. అలఫణిభోగరత్నములు నాదిగిభోత్కటగండగంధము
ల్తలఁపునఁ బాటి సవ్వవసుధాసతి దా భుజకీర్తిమౌక్తిక
చ్ఛలమునఁ గృష్ణరాయనృపచంద్రుని బాహువునందు భూషణో
జ్జ్వలమణులన్మృగీమదమువాసనయుంగని ధూర్తలంగనల్

చ. మునుకొని కొండవీటికడ మూఢత రుద్రుఁడు కృష్ణనందన
న్మనసిజుని న్జయించె నది మానుషమే నరసేంద్రు కృష్ణరా
యనృపతి కొండవీటికడ నాహవభూమిఁ బ్రతాపరుద్రనం
దనుఁ డగువీరభద్రుఁ గరుణామతిఁ గాచె జగత్ప్రసిద్ధిగన్

ఉ. నెలకొని కృష్ణరాయధరణీవిభుఁ డుత్కలభూమిపాలుతోఁ
గలన నెదిర్చి హస్తికరకాండతతు ల్మసకంపుఁబాములై
మలసినచోటఁ గూడినసమగ్రయశోవసనంబు గప్పి తా
వలవఁగ జేసె భూసతిని వశ్యవిధిజ్ఞుఁడు గాన నేర్పునన్. 2

సీ. ఉదయాద్రి వేగ యత్యుద్ధతి సాధించె
వినుకొండ మాటమాత్రన హరించెఁ
గూటము ల్పెదరంగ కొండవీ డగలించె
బెల్లముకొండయ చ్చెల్లఁ జెఱిచె
దేవరకొండయుద్వృత్తి భంగము సేసె
జల్లిపల్లె సమగ్రశక్తి డులిచెఁ
గినుక మీఱ ననంతగిరి క్రిందుపడఁ జేసెఁ
గంబంబుమెట్టు గ్రక్కునఁ గదల్చె
తే. బలనికాయము కాలిమట్టులనె యడఁచుఁ
గటకమును నింక ననుచు నుత్కలమహీశుఁ

డనుదినమ్మును వెలచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు. 23

సీ. బాహుసౌధక్రీడఁ బరఁగుపంటవలంతి
తోయ్యలినిడుదకస్తూరిబొట్టు
వైరిసైన్యాబ్ధిలో వచ్చుగెల్పులనావఁ
గడఁ జేర్చుప్రాఁకుడుఁగడపుఁజేయి
యరికుంభికుంభము క్తాంకురాంకిత మగు
జయరమాకన్యక చదువుపలక
శత్రురాజులకు నచ్చరల నాకర్షించు
సమరేంద్రజాలపింఛంపుఁగుంచె
తే. మేను సగము యశోమహాశానునకును
శౌర్యరవిఁ గోరి వచ్చినచాయ లేమ
నరసవిభుకృష్ణరాయభూనాథచంద్రు
చేత ననిలోన మించుకౌక్షేయకంబు. 24

షష్ఠ్యంతములు.

క. ఏవంవిధగుణఖనికిని
దోర్వనితాప్రార్థ్యమానధూర్తారిధరి
త్రీవరసంగతిసుభగం
భావుకరణముదితకలహాపారణమునికిన్. 25

క. రాధాతనయాధారిత
గాధాధఃకరణనిపుణకరసద్దయునకున్
మేధావదసాధారణ
బోధాకరహృదయునకు విబుధసదయునకున్. 26

క. నాగాంబికాకుమారున
కాగామిగతాధునికనృపాలభవ్యయశ

* శ్రీగలహాస్తితహిమగుది
శాగజతనుకటజనైల్యసంభారునకున్. 27

క. సామర్ష దళితశరభట
సామజహయకూలముద్రుజక్షతజధునీ
కాముకితాఖిలజలధికి
నాముష్యాయణసుధీగృహాంగణనిధికిన్. 28

క. కోదండద్రోణునకును
వేదార్థస్థాపనప్రవీణునకు సమి
న్మేదిష్ఠ విమతతరసా
స్వాదనవశతుందపరిమృజకృపాణునకున్. 29

క. అసుహృదసుపవనవిసర
గ్రసనరసవ్యసనవశవికసదసిరసనా
ప్రసరణశయఫణివిలసన
విస్మృమరమరువకితసమరవీథీస్థలికిన్. 30

క. వైంధ్యద్విపగంధనిబ
ద్ధాంధ్యాళిప్రతిపదోదితాలయవిభవా
వంధ్యప్రబంధకృతిసం
బంధస్వనుభావునకు బుధితమనుభావునకున్. 31

క. వనితాజనతాస్మరునకు
ఘనతాపనితారకాభికద్యుచరగవీ
ఘనతాయనకారకస
త్వనితాత్మనితాంతదానపతతంత్రునకున్. 32

---

* 'శ్రీగుంభహాసితహిమగు' పాఠాంతరము.

క. పరిపంథిదోర్బలసమి
త్పరివర్ధిష్ణుప్రతాపదహనారణికిఁ
సరసకళాధోరణికిఁ
నరసాధిపకృష్ణరాయనాయకమణికిన్. 33

# ప్ర థ మా శ్వా స ము.

## క థా ప్రా ర ం భ ము.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనినపారిజా
తాపహరణం బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి
దనిన. 34

క. జనమేజయనృపవల్లభుఁ
డనుదినమును హరికథాసుధాస్వాదమునం
దనివి సనక వైశంపా
యనముని కిట్లనియెఁ గౌతుకాయత్తమతిన్. 35

సీ. హరివంశకథ లెల్ల నానుపూర్విగ నిట్టు
విని కృతార్థుఁడ నైతి మునివరేణ్య
యాదానవారాతి యమరులఁ బ్రోవంగఁ
బూని యాయదువంశమున జనించి
యతఁడు బ్రహ్మజ వారి కాధార మగుపారి
జాతంబు పుడమి కేరీతిఁ దెచ్చె
ననుమతి నిచ్చిరో యావేల్పు లొండేని
బలిమిఁ జేకొనియెనో పాడి దొఱఁగి

తే. తెలియ నానతి యిమ్ము సందియము దీఱ
వినఁగ వేడుక యయ్యె సవిస్తరముగ
ననిన నావ్యాసమునిశిష్యుఁ డతనితోడ
నధిప విను మని పలికె నత్యాదరమున. 36

చ. హరి నరకాసురుం గెలిచి యద్దను జేంద్రునియింట నున్న య
చ్చరల కొలంబువారి నెలజవ్వనముం బొలిపోనివారిఁ ద
న్వరునిఁగఁ గోరువారి లలనామణులం బదియాఱువేవురం
బరిణయ మయ్యె నారదునిపంపున సౌఖ్యరసైకలోలుఁడై.

తే. మఱియు రుక్మిణి సత్యజాంబవతి బుత్ర
విందభద్ర సుదంత కాళింది లక్ష్మ
ణ యనఁగా మున్న కల రబ్జనాభునకును
మహిషు లెనమండ్రు సమతాభిమానవతులు. 38

ఉ. ఆరమణీలలామముల నందఱఁ గూడి యదూద్వహుండు త
ద్ద్వారవతీపురోపవనవాటికలం గృతకాద్రిసీమల
న్వారిధితీరకుంజసదనంబులఁ గేళితరంగిణీతటీ
కైరవిణీసహాయమణికల్పితసౌధముల న్వసించుచున్. 39

శా. ఏయేవేళల నేసరోజముఖి యేయేలీలలం గోరుఁ దా
నాయావేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి యే
చాయం జూచినఁ దానయై మెలఁగుచు న్సౌఖ్యాబ్ధినోలాడుభో
గాయత్తుండయి పెక్కురూపములమాయాకల్పనాచాతురిన్.

క. హరి యిట్లు సతుల నందఱ
సరిగాఁ జూచియును భోజజనపాలసుతం
దరుణీమణి సాత్రాజితి
నిరువుర మన్నించి మిగుల నిచ్చుం జనవుల్. 41

చ. కులమును రూపము న్మగనికూరిమియుం గలదాన నంచు నీ
వల నలరుక్మిణీరమణి వానిఁ బెనంగఁగ సత్యభామయుం
గులమును రూపము న్మగనికూరిమియుం గలదాననంచు నా
వలఁ బచరింపఁగా రవరవల్వడమె న్మదివారి కెంతయుఞ్.

ఉ. అంతట నొక్కనాఁడు ధవళాంబుజనేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంతగృహంబులోన శశికాంతశిలామయవేదిమీఁద నే
కాంతమునందుఁగొందఱుమృగాయతనేత్రలుగొల్వజూదము
త్యంతవినోదకేలి మెయి నాడుచు నుండఁగ నద్భుతంబుగన్.

శ్రీకృష్ణునివద్దకు నారదుఁడు వచ్చుట.

సీ. సరిగమపధనిససంజ్ఞస్వరంబుల
మహతి నభోవాయునిహతి మొరయ
భాగీరథీపయఃపరిపూర్ణ మణికమం
డలువు హస్తంబునఁ జెలువుమిగులఁ
బ్రణవమంత్రావృత్తిపావనస్ఫటికాక్ష
వలయంబు కర్ణశష్కులికవ్రేల.
సమరనృత్యోచితచమరవాలంబును
గక్షపాలయు భుజాగ్రమున మెఱయ.

తే. దేహకాంతు లకాలచంద్రికల నీన
జడలు మోక్షద్రుపల్లవశంక నేయ
గగనముననుండివచ్చె నాకస్మికముగ
నారివేరంపుఁదపసి ద్వైత్యారికడకు. 44

క. వచ్చినమునిపతి కెదురుగ
వచ్చి నమస్కృతు లొనర్చి వనితయుఁ దానుం
బొచ్చెంబు లేనిభక్తి వి
యచ్చరరిపుభేది సలిపె నాతిథ్యంబున్. 45

తే. అపుడు రుక్మిణికనుసన్న నబ్జముఖులు
రత్నసింహాసనంబు నారదున కిడిరి
హరియు నమ్మౌనియనుమతి నర్హపీఠ
మున సుఖాసీనుఁ డయి కరంబులు మొగిడ్చి. 46

క. సురసంయమివర! మీరిట
కరుదేరఁగ నిప్పుడేఁ గృతార్థుఁడ నయితిన్
నిరతంబు మీరు నాపయిఁ
గరుణ గలిగి యునికి యిదియ కారణము సుఁడీ. 47

క. నాపుడు శౌరికి నిట్లను
నా వేలుపుఁదపసి మర్త్యుఁడా డెడిరీతిన్
నీవిట్లు పలుక నుచితమె?
యే విశ్వజనీనచరిత! యెఱుఁగనె నిన్నున్. 48

నారదుఁడు శ్రీకృష్ణుని నుతించుట.

సీ. ప్రామినుకులవొంగ బాతాళకుహరంబుఁ
దూరఁ బాఱి చీఱినచోఱ వీవ
తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పులఁ గూడి
చవిఁ దేల్చినట్టికచ్ఛపమ వీవ
నీటిలో మునిఁగిన నేలచేడియఁ గొమ్ము
కొన నుబ్బ నెత్తినఘోణి వీవ
మునిమాపు బలుగంబమునఁ బుట్టి బంటు న
క్కఱఁ గాచినట్టిసింగంబ వీవ

తే. దితిజు మెట్టినయాపొట్టిదిట్ట వీవ
పుడమిఱేఁడుల నడఁచినప్రోడ వీవ
కడలిఁ గోలకుఁ దెచ్చినగబ్బి వీవ
యిపుడు ద్వారక వసియించునీవు నీవ. 49

క. రక్కసిమగువలయీలువు
మొక్కపడిచె దీవ పాపములగమి కాలం
ద్రొక్కెదవు నీవ యింకిట
నిక్కముగా నిన్నుఁ బొగడ నేర్తునె కృష్ణా! 50

క. ద్వారక వైకుంఠపురం
బీరుక్మిణి లక్ష్మి మీర లిచ్చట నునికిన్
సారెకుఁ గొల్వఁగ వత్తును
గోరికతోఁ గంసహర! ముకుంద! మురారీ! 51

వ. అని యిట్లు బహుప్రకారంబులం బ్రశంసించి యవ్విరించినం
దనుం డమందానందంబు డెందంబునం గ్రందుకొన నిజవాస
నాబిరుదగాథాకథనవంది బృందాయమానేందిందిరంబును
నుచితోపయోగజనితానందబాష్పసందోహశంకావహామక
రందబిందుతుందిలంబును నిఖిలమనోరథప్రదానకీర్తిశంకాక
రవిశదప్రభానిచులితంబును నగుపారిజాతంపుఁగ్రొన్నన మి
న్నేటి పసిండినెత్తమ్మిచిగురుటాకునం బొదివి యిచ్చిన. 52

క. వినయంబు విస్మయంబును
మనమునఁ బెనఁగొనఁగ నపుడు మాధవుఁ డాక్రొ
న్ననఁ గయికొని భీష్మకనం
దనఁ గనుఁగొని సత్యభామ తలఁపున నిలువన్. 53

మ. ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో
మది సాత్రాజితి దాని కే నిపుడు ప్రేమం బంపినన్ దీని నె
ల్లిదముం జేసినజాడ దోఁచునొకో యాలెమ్మిందునే నున్కిఁ
జెల్లదువో యేరికిఁ బంపఁగాననుచు లీలన్ రుక్మిణీకాంతకున్.

చ. కనుఁగవఁ బిన్ననవ్వు దొలఁక న్మునినాథునికన్నుసన్న ని
చ్చినఁ దగభోజనందనయుఁ జేకొని మౌనికి మ్రొక్కి యవ్విరిం

దననెఱిగొప్పునం జెరివిన న్వలిగుబ్బలిముద్దుఁబట్టి లేఁ
తనెల ధరించిన ట్లమరెఁ దద్దయు మోహనకాంతిసంపదన్.

సీ. మగమీలనగఁ జాలు తెగ గీలుకొను వాలుఁ
గనుఁగవ కొకవింత కాంతి యొదవె
వలిజక్కవలపెక్కువలు దక్కవగ నిక్క
చనుదోయి కొకవింతచాయ దోఁచె
నెలతుమ్మెదలదిమ్ము వెలిఁ జిమ్ముచెలువమ్ము
గలవేణి కొకవింతనలుపు మీఱె
నలచెందొవలవిందుచెలువొందు వెసఁ జిందు
మొగమున కొకవింతజిగి దొలంకెఁ

తే. జక్కఁదనమున కొకవింతచక్కఁదనము
జవ్వనంబున కొకవింతజవ్వనంబు
విభ్రమంబున కొకవింతవిభ్రమంబు
గలిగె నద్దివ్యకుసుమంబుకతన సతికి. 56

క. కలకంఠకంఠి యీగతిఁ
బులుగడిగినముత్తియంపుఁబోలు పొందంగా
నెలన వ్వాలయఁగఁ బలికెను
జలజాసనుపట్టి కలహసంభ్రమపరుఁడై. 57

నారదుఁడు పారిజాతప్రభావంబు రుక్మిణీదేవికిఁ జెప్పుట.

సీ. జలజాక్షి! యిది పారిజాతప్రసూనంబు
నరులకు ధరియింప నరిది సూవె
పౌలోమి పార్వతి పద్మ పద్మజురాణి
యును శిరంబునఁ దాల్తు రనుదినంబు
హరిబహిఃప్రాణంబ వగుట నేఁ డెఱుఁగంగ
వచ్చె నీ కిపు డిది యిచ్చెఁ గాన

వెలఁదులు పదియాఱువేవురలో నెన్న
సరి లేదు సౌభాగ్యగరిమ నీకుఁ
తే. నీవు దాల్చినకతన నీపూవు నేఁడు
భాగ్యము వహించె నుచితోపయోగ్యవృత్తి
నీప్సితార్థంబు నొడఁ గూర్చు నిది లతాంగి
దీనిమహిమంబు చెప్పెదఁ దెలియ వినుము. 58
క. పరిమళము సెడదు వాడదు
పరువము దప్పదు పరాగభరభరితం బై
నిరతము జగదేకమనో
హర మగు నీ కుసుమరాజ మంబుజవదనా! 59
మ. అళినీలాలక! నీవు నీపతి రహస్యక్రీడవర్తించు వే
ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు గల్పించును
జ్జ్వలదీపాంకుర మై రతిశ్రమతనూసంజాతధారాళఘ
ర్మలవంబు ల్దొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్.
చ. అడిగినయంత*లో రసిరసాన్నముల న్సమకూర్చు నాఁకట
న్బడలికఁ జెందనీక యశుభంబు లండచు జగత్త్రయంబునం
బడయఁగరానిసర్వగుణభవ్యము సు మ్మిది దీనిఁ దాల్చియి
ప్పడఁతులలోఁగనుంగొనుమపారమహామహిమానుభావముల్.
చ. కువలయపత్త్రనేత్ర! నెఱిగొప్పున నీకుసుమంబుదాల్చుటన్
సవతులు వచ్చి నీచరణసారసయుగ్మము నాశ్రయింపఁగా
ధవుఁ డబలేనికూర్మి జవదాఁటక నీపలు కాదరింపఁగా
నవిరళభోగభాగ్యమహిమాన్విత వై విహరింతు గావుతన్.
క. నెలకొని వేసవిఁ జలువయుఁ
జలివేళల నుష్ణగుణము సముచితభంగిం

---

* లోన సరసా.

గలిగించు నీలతాంతము
కొలఁదులు చెప్పంగ నిచ్చకొ త్తలు సుమ్మీ. 63

క. అలరుంబోఁడులలోపల
నలరుం బోఁడుములు నీకు నగ్గల మగుచున్
దలపూ వాడక యుండుము
తలపూవు ధరించి వికచతామరసాక్షీ! 64

ఉ. ఇన్ని దినంబులున్ సవతు లిందఱిలో నలసత్యభామ కన్
నన్నలఁ బ్రిమ్మరున్ హరి వశంవదుఁడై యనవిందుఁ గాని యో
కన్నియ! నీయెడం గలుగుగౌరవ మెయ్యెడఁ జూచి కానలే
కున్న ననర్ఘ్యదివ్యకుసుమోత్తమ మేరికినైన నిచ్చునే? 65

ఉ. చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ బే
రెక్కినదాన నంచుఁ బతియెంతయు నాకనురక్తుఁ డంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య యింతకున్
స్రుక్కకయున్నె నీమహిమ సూచినబోటులు విన్నవించినన్.

క. ధరియించిన మొద లొకవ
త్సరమాత్రము దావకీనధమ్మిల్లములో
నిరవుకొని మగుడ నివ్వెరి
తరుణీ యలపారిజాతతరువున కరుగున్. 67

తే. అనుచు నారదుఁ డాడినయట్టిపలుకు
లచటివృత్తాంత మంతయు నరసి పోయి
వేఱు వేఱున సఖులు దేవేరులకును
విన్నవించిన వారును జిన్నవోయి. 68

ఉ. అందఱిలోనఁ బెద్ద మహిమాన్విత రుక్మిణి గానఁ *బూవుగో
విందుఁడుదాని కిచ్చెఁ దగవే యని లక్షణయోర్చెనై చెఁగా

* యామె కిం, పొందఁ బ్రసూనమీఁ దగవ పొమ్మని లక్షణ.

ళింది శమించె భద్రయవు లెమ్మనియూరడిలెన్ సుదంతలోఁ
గుందుట మానె జాంబవతికోపమడంచెనుమిత్రవిందయున్.

తే. వారిలోపల సౌందర్యవతియు మాన
వతియు మహనీయసౌభాగ్యవతియు నైన
సత్య యంతట నేమోకో శౌరికడకుఁ
బోయి రా దయ్యెఁ జెలి ప్రొద్దు వోయె ననుచు. 70

మ. తనశృంగారవనంబులోన గిరిప్రాంతం జక్కఁగా దిద్ది తీ
ర్చినపూదేనియయేటికాలువదరిం జెంగల్వపుప్వాళ్లు నిం
చినచంద్రోపలవేదిపై సరసగోష్ఠిన్ బోటియుం దాను న
వ్యనజాతాయతనేత్ర శౌరిగుణముల్ వాక్రుచ్చివర్ణించుచున్.

చ. అలికులరావముల్ గిసలయాకులకోకిలకాకుకాకలీ
కలకలనాదముల్ సెలఁగఁ గమ్మనితమ్మికొలంకుతెమ్మెరల్
వాలయఁగఁ దొంటిచందమున బుద్ధికినేమియు నింపుగామికిం
గలఁగుచుసత్యభామచెలిఁగన్గొనియించుకసంశయించుచున్.

చ. అకటయదేమిరో యెఱుఁగనయ్యెదఁ దొయ్యలిదక్షిణాంస
చూ, చుకనయనప్రకంపగుణసూచనలేమియు వల్లగావు సా,
రెకు మది జాలివొందె యొకరీతిఁదలంకెడు బ్రాణనాథుఁడొం
డొకచపలాక్షిఁ గూడి నను నొల్లనిచెయ్దము లేమి సేసెనో.

క. అని సత్యభామ తనవిధ
మనుఁగుందొయ్యలికిఁ జెప్పనవసరమునఁ జ
య్యన వచ్చి యొక్కనెచ్చెలి
కనుఁగవ నెఱసంజ వొడమఁగా నిట్లనియెన్. 74

క. అమ్మా ! యే మని చెప్పుదు
నెమ్మి న్నీవిభుఁడు రుక్మిణీసతిమణిసొ

ధమ్మున నుండఁగ సురముని
గ్రమ్మఱ నాకస్మికమ్ముగా నచ్చటికి౯. 75

క. చనుదెంచి యమ్మురారికి
ననఘ మ్మమరైకయోగ్య మతిసౌఖ్యకర
మ్మనితరసులభ మ్మిది యని
కొనియాడుచు నొక్కదివ్యకుసుమ మ్మొసఁగెన్. 76

క. మిన్నంది వేగ గయికొని
కన్నుల నొత్తికొని మ్రొక్కి గారవ మెసఁగ౯
వెన్నుఁడు రుక్మిణి కొసఁగెను
అన్నెలఁతయుఁ గొప్పులోన నవ్విరి దాల్చె౯. 77

తే. అంతలోనన యద్భుతం బావహిల్లఁ
గొలఁది యిడరానియొకవింత చెలువు గలిగి
రాజబింబాస్య రుక్మిణి తేజరిల్లె
సానఁ బట్టినమకరాంకుశస్త్ర మనఁగ. 78

ఉ. ఆకుసుమంబు దాల్చినమహామహిమంబునఁ దోడి కామినీ
లోకము మచ్చరంబు మదిలోనఁ దొఱంగి భజించు చుండ న
స్తోకనిజప్రభావములు సూపెడుగద్దియమీఁద నెక్కి ము
ల్లోకము దాన యేలుగతి లోలవిలోచన యేమి సెప్పుదుర౯.

ఉ. ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బతిఁ గూర్చుదాన నా
యంతటివారు లే రని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచు౯
పంతున వచ్చుసత్యగరువం బిఁకఁ జెల్ల దటంచు మానినీ. 80

క. ఆరణభోజనుమతకము
లారుక్మిణినటన లామురాంతకుచెయ్వుల్

చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబు రాదు వారిజనేత్రా ! 81

—॥ సత్యభామ చింతనొందుట. ॥—

చ. అన విని ప్రేటువడ్డయురగాంగనయుంబలె నేయివోయ భ
గ్గన దరికొన్న భీషణహుతాశనికీల యనంగ లేచి హె
చ్చినకనుదోయి కెంపు దనచెక్కులఁ గుంకుమపత్త్రిభంగసం
జనితనవీనకాంతి వెదచల్లఁగ గద్గదఖిన్నకంఠియై. 82

శా. ఏ మేమీ కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా
యామాట ల్చెవి యొగ్గి తా వినియెనా యాగోపికావల్లభుం
డే మే మాడెను రుక్మిణీసతియు నీ విం కేటికిన్ దాఁచెదే
నీ మోమోటలు మాని నీరజముఖీ! నిక్కం బెఱింగింపవే.

చ. అతులమహానుభావ మని యవ్విరిఁ దా నొకపెద్ద సేసి య
చ్యుతునకు నిచ్చకం బొదవ సూడిద యిచ్చిననిచ్చఁ గాక తా
నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణ సేసినఁ జేసెఁగాక యా
మతకరివేలుపుందపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చుటన్. 84

క. పలు దెఱఁగునుల్ల మాటలు
కలహమె కల్యాణ మని జగంబుల వెంటన్
మెలఁగెడుమౌనికి సహజము
వల దని వారింపవలదె వల్లభుఁ డతనిన్. 85

క. ముని యేమి సేయు ? రుక్మిణి
గొనఁ గారణ మేమి ? ధూర్తగోపాలుఁడు సే
సినచెయిద మేమి చెప్పుదు ?
మన మెరియదె ప్రాణ మైనమగఁ డిట్లయినన్. 86

క. పరికింపరు తమజాడలు
తరుణులతగులములు నమ్మఁ దగ దం(డ్రు) మదిఁ
శరదంబుదచలచిత్తులు
పురుషులె పో వారినమ్మఁ బోలునె! చెలియా! 87

ఉ. ఇన్నిదినంబులుఁ సవతు లిందఱిలోఁ గడు గారవంబునం
గన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁ గప్పుకొనంగ నుండియా
వన్నెయు వాసియుం దఱిఁగి వారననుం దలకెత్తిచూడఁగా
సన్నలఁ జాయలం బలుక సైతునె ప్రాణము *లింతతీపొకో!

ఉ. నామొగమోటకై వలసి నాటకముల్ ఘటియించి రుక్మిణీ
కామిని మీఁదటం గలుగుగౌరవముం గృపయుం బ్రియం
బుఁ దా, నేమియుఁ గాన నీక యిట నిన్నిదినంబులు నన్నుఁ
దేల్చెనో, తామరసాక్షు! మెచ్చవలదా మురదానవభేది
[కృత్యముల్.

ఉ. ఓచెలి! శౌరి కిచ్చె నఁట యొక్కలతాంతము దెచ్చి నారదుం
డాచపలాక్షి కిచ్చె నఁట యాతఁడు నవ్విరి యిట్టిమాటలా
హా! చెవుల న్వినంబడియుఁ బ్రాణము దాల్చెద మేన నింతగా
నోఁచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మెయి నున్నదాననో. 90

క. పూనుకొని మేలుగీళ్లకు
లో నయి విహరించువారి లోకమెఱుఁగదో
యానరకాసురదమనుఁడు
దా నెఱుఁగఁడో భోజకన్య తా నెఱుఁగదొకో. 91

ఉ. ఆసరసీరుహాక్షి నిలయంబునఁ బంకజనాభుఁ డుండుటం
జేసి యొసంగెఁ బోతగవు సేకొని యొక్కలతాంత మింతలో

* లెంత తీపొకో.

హసాసియు వన్నెయుం దగవువైభవముంజలమున్వివేకమున్
బోసవతుల్భజించుటకుఁ బో వెఱఁగయ్యెడు నేమి సెప్పుదున్.

క. కలకాల మొక్కగతిఁ బూ
సలలో దారంబుమాడ్కి సతిమదిలోనన్
మెలఁగెడుపురుషులు గలుగుట
తొలుజన్మమునోముఫలము తోయజనేత్రా! 93

సీ. కలలోననైన నవ్వులకైన నామాట
జవ దాఁట వెఱచునో చంద్రవదన!
యేపదార్థంబు నాయెదుటఁ బెట్టకమున్న
యెవ్వారి కొసఁగఁడో యిగురుఁబోఁడి!
చెలులు నాతో నేమి చెప్పుదురో యని
లంచంబు లిచ్చునో చంచలాక్షి!
తోడిచేడియలు నాతోడివంతులకు రా
సయిరింపఁజాలఁడో సన్నుతాంగి!

తే. యరమరలు లేనికూరిమి ననఁగి పెనఁగి
కొదలు దీఱనికోర్కులఁ గూడి యాడి
కపట మెఱుఁగనిమమతలఁ గలసి మెలసి
యున్నవిభుఁ డిట్లు సేయునే యోలతాంగి! 94

సీ. కృతకాద్రికందరాకేళీనికూహాన
వేళా*పరస్పరాన్వేషణములు
పోషితమాధవీపున్నాగపరిణయో
త్సవకల్పితానేకసంభ్రమములు
చాతురీనిర్జితద్యూతపణాదాన
కలితచేలాంచలాకర్షణములు

* పరస్పరావేల్లనములు.

3





సాయంసమారంభచక్రవాకద్వంద్వ
విరహావలోకన*విభ్రమములు
తే. సాంద్రతరచంద్రికా†కేళిచంక్రమములు
విధుశిలామయవేదికావిశ్రమములు 7
ఫలకచిత్రితనిజరూపభావనములు
మఱచెనో యింక రుక్మిణిమాయఁ దగిలి. 95

క. పతి ప్రాణసదృశబంధువు
పతి దైవం బేడుగడయుఁ బతి సతులకు న
ప్పతియ కడు మేర దప్పిన
గతి కులకాంతలకు వేఱు గలదే చెపుమా. 96

క. ధన మిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగ వచ్చు మగఁ డింతులకుం
జన విచ్చి పుచ్చుకొన్నను
మన వచ్చునె యింక నేటిమాటలు చెలియా! 97

క. అని వగల మిగుల నొగులుచు
జనితామర్షమునఁ గోపసదనంబునకుం
జనియెను లతాంగి హరిచం
దనకోటరమునకు నాగతరుణియుఁబోలెన్. 98

ఉ. మాసినచీర గట్టుకొని మానముతోడ నిరస్తభూష యై
వాసెనకట్టు గట్టి నిడువాలికగస్తురిపట్టు వెట్టి లోఁ
గాసిలి చీకటింటికడకంకటిపై జలదాంతచంద్రరే
ఖాసదృశాంగి యై పొరలె గాఢమనోజవిషాదవేదనన్. 99

చ. బిసరుహపత్త్రలోచనకుఁ బెల్లగు మోహము సంఘటిల్లె వె
క్కసమగు నెవ్వగల్వొడమెఁ గంపము పుట్టెఁ జెమర్చె మేనుమా

* విహారణములు. † వళి.

నసమున విన్నఁబా టొదవె నాఁటఁ గడుం బరితాపవేదనల్
మనకప్పఁబాముకాటుగతి మచ్చర మన్విస మగ్గలింపఁగన్.

క. వెడవెడ గన్నుమూయుఁ గను విచ్చు నగుం దలయూఁచుఁ
బాన్పుపైఁ, బడు నుసు రంచు లేచుఁ దడఁబాటును దత్త
రముం జలంబులో, నడరఁగఁ గోపవేగమున నగ్గల మైనమ
నోజబాధలం, బడి మదహస్తిహస్తగతపద్మినియుం బలె
సొంపు పెం పఱన్. 101

తే. ఈపగిది సాత్రాజితి
కోపోద్యోగమున వగలఁ గుందుచు ఘనసం
తాపంబుపేర్మి నితర
వ్యాపారము మాని యుండె హరియును నచటన్. 102

సత్యభామకడకు శ్రీకృష్ణుఁడు వచ్చుట.

మ. ముని నా కిచ్చినపూవుచందమును నే మున్నాడియీభోజనం
దన కర్పించినజాడయుం దెలియఁ జెంతం బొంచి వీక్షించి పో
యినసాత్రాజితిబోటి నావలనఁ దా నేమేమి కల్పించెనో
యని ప్రద్యుమ్ననిమానిచండనిడిచింతాయత్తచిత్తంబునన్.

చ. అరదము నెక్కి కేతనపటాంచలచంచల మైనతాల్మితోఁ
దురగజవంబు మున్గడవఁ ద్రోచి కడంగెడుతత్తరంబుతోఁ
దిరిగెడుబండికండ్లపగిదిన్ భ్రమియించుమనంబుతోడ నా
హరి సనుదెంచె సత్యసముదంచితకాంచనసౌధవీథికిన్. 104

తే. వచ్చి యరదంబు డిగ్గి తద్ద్వారసీమ
దారుకుని నుండ నియమించి తాన యొకఁడు
కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి
యలబలము లేనినగ రెల్ల నరసి చూచి. 105



సీ. కనకపంజరశారికలకుఁ జక్కెర వెట్టి
చదివింప రేలొకో సకియ లిప్పుడు
కరతాళగతుల మందిరమయూరంబుల
నాడింప రేలొకో యతివ లిప్పుడు
క్రొవ్వాఁడిగోళ్ళఁ దంత్రులు మీటి వీణియ
ల్వలికింప రేలొకో భామ లిప్పుడు
కలికిరాయంచబోదల నెల్ల నెలయించి
నడిపింప రేలొకో పడఁతు లిప్పుడు
తే. ఇన్నిదినములవలె నుండ దేమి నేఁడు
చిన్నబోయిన దీమేడ చెన్ను దఱిఁగి
పద్మముఖితోడ నెవ్వరేఁ బారిజాత
పుష్పవృత్తాంత మెఱిఁగింపఁ బోలు నొక్కొ. 106

క. అని యనుమానించుచు నా
య్యనఁ గోపగృహంబు సేరి యాసత్రాజి
త్తనయ ముసుంగిడి యుండఁగ
ననువు మెఱయఁ జొచ్చి మాయ యచ్చుపడంగన్. 107

ఉ. కొందఱు మంతనంబులను గొందఱు జంకెనవాఁడిచూపులం
గొందఱుఁ జేతిసన్నలఁ దగుల్పడఁ జేయుచుఁ జేరఁబోయి మ
ధ్యందినభానుమండలకరావళి పోవలి వాడి యున్నతీఁ
గం దలఁపించునమ్మగువఁ గన్గొనియెంతయు విస్మితాత్ముఁడై. 108

ఉ. ఈలలితాంగిచంద మొకయించుక చూచెదనంచు ధూర్తగో
పాలుఁడు తాలవృంత మొకభామిని [illegible]ప్యపిఉందనుండి మం
దాలసలీలమై విసర నాచటుకైకొని వీచెఁ దద్వపుల్ల
కీలితపంచసాయకశిఖిం దరికొల్పుచు [illegible]న్నకై వడిన్. 109

ఉ. అంతటఁ బారిజాతకుసుమాగతనూతనదివ్యవాసన
ల్వింతలు సేయఁదావియదివిస్మయమంచుమునుంగుఁ ద్రోచియ
క్కాంత గృహంబు నల్గడలు నారసి సంభృతతాలవృంతునిం
గాంతునిఁ జూచి*బాష్పకణికాతరళీకృతలోచనాంతయై.

క. తల వాంచి మగుడ ముసుఁగిడెఁ
గోలుకుల డిగజాఱి జాలుకొనుబాష్పంబుల్
పలుచనిచెక్కుల లవలీ
దళపతితమరందబిందుతతిఁ బురడింపన్. 111

ఉ. ఓ రొప్పకయింత లేనివికచోత్పలలోచనచిత్తవీథిఁ జ
ల్లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వే సను దెంచె నంచుఁ గం
దర్పహుతాశను న్వెలికిఁ దార్చుపఖుండనుబోలె వేఁడిని
ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమితావరణాంశుకాంతమై.

చ. వనితకుచద్వయంబుపయి వ్రాసినకుంకుమపత్త్రభంగము
ల్జనితనితాంతఘర్మకణజాలముచేతఁ గరంగి మెల్లమె
ల్లన వెలిపట్టుపయ్యెదకెలంకుల జాఱుట యొప్పె మానసం
బున నెలకొన్నక్రోధరసము †న్వడఁబెట్టుచు నున్నకైవడిన్.

క. మానవతి యిట్లు మానని
మానక్రోధములచేఁ గుమారిలి చింతా
ధీనగతి నుండ మదిలో
నూనినప్రేమమున నంబుజోదరుఁ డనియెన్. 114

—శ్రీకృష్ణుఁడు సత్యభామ ననునయించుట.—

ఉ. ఇందునిభాస్య! మైతొడవు లేల ధరింపవు ‡నున్నఁగావులీ
వెందును మాన లేవు దెలు పేటికిఁ గట్టితి వీటికారుచు

* బాష్పకళికా. † న్వడిఁబెట్టుచు; నద్వవెట్టుచు. ‡ సన్నఁగావు.

ల్కొందలిరాకు మోవిఁ దులకింపఁగఁ జేయక యున్కి యే
మి నీ, చందము వింత యయ్యెడు నిజంబుగ నా కెఱుఁగంగఁ
జెప్పుమా. 115

చ. మన మరయందలంచి యొకమార్గము వన్నితి నవ్వుటాలకో
నను వెఱపించెదో యకట నాయెడ *నిక్కము దప్పఁగల్గెనో
వనజదళాయతాక్షి! పగవాఁడనె నన్నిటు లేల చూడ వా
క్కనిమిష మైన నీవు దయఁ గన్గొనకుండిన నిల్వనేర్తునే.

చ. పలుకులఁ దేనె లుట్టిపడఁ బల్కవు నేఁ డిది యేమి†వాలుఁగ
న్నులనునుసిగ్గునూల్కొనఁగనుంగొన వేలయురఃస్థలంబుఁ జ
న్నుల నెదురొత్తి మక్కువ ననుం బిగికౌఁగిటఁ జేర్పవేటికే
చిలుకలకొల్కి! యెవ్వ రెడ సేసిరి నీ కిటు లేల చింతిలన్.

చ. మనముల మాటలం గ్రియల మన్నన లీనొకనాఁడు నెట్టికా
మినులకు గారవంబు వెఱ మెచ్చులకై పచరింతుఁ గాని పా
యనియనురక్తి నీయెడల యగ్గలమై కనుపట్టు నాకు నీ
పనిచినపంపు సేయుటయ ప్రాభవ మాటది నీ వెఱుంగవే.

మ. పడఁతీ! నీమధురాధరామృతము నీబాహాపరీరంభముం
బడయన్ ధన్యుఁడఁ గాకయుండిన నను న్బాటించియొక్కింతనీ
నిడువాలుంగడగంటఁ జూడుమనుచున్నిల్పోపమింబై చెఱం
గొడియం జేవిరిదమ్మి ప్రేయుటకునై యుంకించి జంకించినన్.

ఉ. పాటలగంధి చిత్తమునఁ బాటిలుకోపభరంబు దీర్ప నె
ప్పాటను బాటు గామి మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతిమాళిమణిపంక్తికి వన్నియ వెట్ట నాజగ
న్నాటకసూత్రధారియదునందనుఁడర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్.

* నిక్కపుఁదప్పు. † క్రాలుఁగన్నుల.

మ. జలజాతాసనవాసవాదిసురపూజాభాజనం బై తన
ర్చులతాంతాయుధుకన్నతండ్రి శిరమచ్చో వామపాదంబునం
దొలఁగం ద్రోచెలతాంగియట్లయగునాథుల్నేరము ల్సేయఁ జే
రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారము ల్నేర్తురే.

క. కోపనపదహతిఁ గుహనా
గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడువఁగ ను
ద్దీపితమన్మథరాజ్య
ప్రాపితుఁడై పలికెఁ గూర్మి బయలు పడంగన్. 122

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁబూని తా
చినయది నాకు మన్ననయ చెల్వగునీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానము *దాఁకిన నొచ్చునంచు నే
ననియెద నల్క మానవుగదా యిఁక నైన నరాళకుంతలా!

— సత్యభామ శ్రీకృష్ణుని దూఱుట. —

చ. అన విని మానినీతిలక మప్పుడు మే యఱ దోఁప నిక్కి పై
డినకచపంక్తిఁ బల్మఱు ముడి న్వెడ దోపుచుఁ బైచెఱంగు గ్ర
క్కునఁ జనుదోయిఁ జేర్చుచు మొగంబున లేఁజెమరంకురింపఁ జం
కెన నెఱిచూపుచూచి పలికెం జలితాధరపల్లవాగ్రయై.

ఉ. ఈనయగారవుం బ్రియము లీపస లీమొగమిచ్చుమాట లే
లా నిను నమ్మియుండినఫలం బిదె తోడన కల్గె నాకు నీ
యాన సుమీ ననుం జెనకి యాఱడి వెట్టిన నవ్వు వారలం
గాన నెఱుంగునే పసులకాపరి భావజమర్మకర్మముల్. 125

ఉ. ఇంకిటు నిన్ను నమ్మ నను నేమిటికిం గెరలించె దెంతయుం
బొంకము గాని యీవలనిబొంకుల్లు మాచవి గావు రుక్మిణీ
పంకజపత్రనేత్రకును బ్రాణపదంబులు గాని వల్లపీ

* నాటిన.

కింకర! చాలుఁజాలు *నడిఁకింపకు నింపకు లేనికూరుముల్.

ఉ. †గట్టినచేఁతలుం బవలుఁ గల్లవనంబులు నీవు పుట్టఁగాఁ
బుట్టిన వెందు లేనిపలునోకలమాయలు నీకు వెన్నతోఁ
బెట్టిన వో కుటెంగియును జేలతనంబున నిన్ను నమ్మి నా
గుట్టును దేజము న్మిగులఁ గోల్పడిపోతిని నేమి సేయుదున్.

చ. మునిపతివచ్చి పూవొసఁగి మోదముతోడ భవత్ప్రియాంగన
న్వినుతి యొనర్పఁగా వినినవీనుల మాచవి గానిమాటల
న్వినవలసెం గదా యిపుడు నీ విట వచ్చుట పారిజాతవా
సనఁ బ్రకటించి నాకు నెకసక్కెము సేయన కాదె చెప్పుమా

క. మానంబె తోడవు సతులకు
మానమె ప్రాణాధికంబు మాన మఖిలస
మ్మానములకు మూలం బగు
మానరహిత మయినబ్రదుకు మానిని కేలా. 129

తే. తనదుకోడండ్రలోనఁ బెద్దయుఁ గ నన్ను
దేవకీదేవి మన్నించు నీవు నాకుఁ
జనవు లిచ్చుటఁజేసి యాసాధ్వినేవ
నేయఁ బోవంగ నా కింక సిగ్గు గాదె. 130

సీ. ఉవిద యెవ్వతె నోఁచి యున్నదో యీశమం
తకరత్న మింక నెవ్వదల ధరింప
నీరైవతకశైలచారుస్ఫాటవిటంక
కేలి కిం కెవ్వతె పాలుపడునొ
యెవ్వతె కబ్బునో యీవసంతారామ
కర్పూరకదళికాగారవసతి

* నుడికింపకు. †గట్టువచేఁతలుం.

లీల నీమణిసౌధజాలకంబుల నిన్నుఁ
గూడి యెవ్వతె వార్ధిఁ జూడఁ గలదొ
తే. యకట నేఁ బెంపఁ బెరిఁగిన శుకమయూర
శారికాబృంద మెవ్వతెఁ జేరనొ్కొ
నన్ను నాతోడిసవతులు నగక మున్న
పంత మలరంగ నిన్ను మెప్పింతుఁ గాన. 131

క. నను నెవ్వతెఁ గాఁ జూచితి
వని యంతర్బాష్ప యగుచు నవనతముఖి యై
ఘనతరగద్గదికాని
స్వనమున మఱి మాటలాడ శక్యము గామిన్. 132

ఉ. ఈసునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుట న్లలితాంగి పంకజ
శ్రీసఖ మైనమోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్. 133

ఉ. ఆరమణీలలామ మది నంటినకోపభరంబు నిల్పఁగా
నేరక యెవ్వగం బొగుల నీరజనాభుఁడు నిండుఁగౌఁగిటం
జేరిచి బుజ్జగించి సునుఁజెమ్మటఁ జాలుకొనంగ జాలుక
న్నీరుకరంబునందుడిచి నెయ్యముఁదియ్యముఁదోఁపనిట్లనున్.

ఉ. ఓలలితేంద్రనీలశకలోపమకైశిక యింత వంత నీ
కేల లతాంతమాత్రమున కేఁ గలుగ న్వను నీకు దేవతా
కేలివనంబు సొచ్చి యనికి న్బలసూదనుఁ దెత్తి వచ్చినన్
దీలు పడంగఁ దోలియిటఁ బెచ్చెదనిచ్చెదఁ బారిజాతమున్.

తే. వామలోచన ! నీకేలివనములోనఁ
జలువ వెదచల్లుచెంగల్వకొలనికెలన

సరసకర్పూరకదళీకాతరులనడుమఁ
బెరటిచెట్టుగ నాటింతుఁ బెంపు గనుము. 136

క. అని పలుకునంబుదశ్యా
మునిగర్జితమధురవాక్యముల సత్యామా
నిని నీపలతికవోలెం
గనుపట్టె సఖీమయూరికలు సెలరేఁగన్. 137

మ. దయమానాక్షివిలోక! లోకహితకృత్ప్రారంభ! రంభాకుచ
ద్వయదుర్గాధిపతిద్విషత్పరితగాథావ్యక్తదోస్సార! సా,రయ
శస్సాంద్రదిశాంత! శాంతహృదయారంగన్నయాచార! చా
రయుతోపాయవిచారచారణగణప్రస్తూయమానోదయా!

క. ప్రతివర్షవసంతోత్సవ
కుతుకాగతసుకవినికరగుంభితకావ్య
స్మృతిరోమాంచవిశంకిత
చతురాంతఃపురవధూప్రసాదనరసికా! 139

నర్కుటము.—

ప్రసృతివిలోచనాకుసుమబాణ! దిశాలలనా
ఘుసృణపటీరలేపకృతికోవిదబాహుతటీ
విసృమర*కీర్తి! రస! విక్షత విక్షవైరినృప
త్యసృగతిపంకిలాసిముఖ! †రాయెందవవంశమణీ! 140

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధసారసార
స్వతాభినంది నందిసింగయామాత్యపుత్ర కౌశికగోత్రపవిత్ర
సుజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతం బైనపారిజాతాప
హరణం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

*విసృమరశౌర్యకీర్తిభరవిక్షతవైరి; విసృమరకీర్తిజాలరణవీక్షితవైరి. †యాదవ.

# ద్వితీయాశ్వాసము.



శ్రీసదనలోచనాబ్జ! ద
యాసారమరందపోషితార్థభ్రమరో
ల్లాసగుణ! మలయకూట
ప్రాసాదనివేశ! కృష్ణరాయమహీశా. 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
వరున కిట్లను నమ్మౌనివల్లభుండు
పారిజాతంబు దే నిట్లు ప్రతిన *వట్టి
చంద్రశాలకు నేతెంచి చక్రధరుఁడు. 2

మ. సరసాలాపముల న్వినోదకథల న్సాత్రాజితీదేవిఁ బ్రే
మరసాంభోనిధి నోలలార్చి కడు సమ్మానంబు గావించి ని
ర్భరకౌతూహలవృత్తి నుండ ఘటికాపర్యాప్తిఘంటారవాం
తరనిర్ణీతములై వినంగఁబడియె న్మధ్యాహ్నశంఖధ్వనుల్. 3

తే. సమయకృత్యంబు లప్పుడు సలుపఁ దలఁచు
నలిననాభునిచిత్తంబు దెలిసి సత్య
భామకనుసన్న నుడిగంపుఁబద్మముఖులు
నిలిచి రంతంత వినయంబు దోఁపఁ జెదుట. 4

క. తలిరాకుఁబోఁడి యొక్కతి
జలకమునకు వేళయనుచు శౌరికి వీణా

---

* పలికి.

కలకలములఁ గలకల నగు
పలుకుల మెల పొలయ విన్నపము గావించెన్. [illegible]

ఉ. ఇంచినవేడ్కఁ నాత్మహృదయేశ్వరిఁ గన్గొని శౌరి మందహా
సాంచితనేత్రుఁ డై జలక మాడఁగ నెమ్మని పైఁడిచేలకొం
గించుక జారి నొక్కతరలేక్షణహస్తముఁ గేల నూఁదుచుఁ
గంచుకిసంచయంబు సముఖా యన గద్దియ డిగ్గి డిగ్గినన్. [illegible]

క. ప్రామినుకులపూఁబోఁడుల
సీమంతపుఁజెందిరంబుచే బలె నరుణ
శ్రీమించు నతనిపదముల
భామామణి యొార్తు పయిఁడిపావలు దొడిగెఁ. [illegible]

తే. కేళిగతి మీఱి మజ్జనశాల కరిగి
శాతమన్యవమణిమయాసనమునందుఁ
గౌస్తుభాదివిభూషణోత్కరము లెల్ల
నొయ్య నొయ్యన సడలించి యున్నయంత. [illegible]

—శ్రీకృష్ణుని మాధ్యాహ్నికస్నానము.—

ఉ. కంపనలీలమై నసదుఁగా నసియాడఁ గుచద్వయంబు న
ర్తింప లలాటరేఖ చెమరింపఁగ హాటకలతాగుళుచ్ఛముల్
తుంపెసలాడఁ గంకణమృదుధ్వని తాళగతిం జెలంగఁగా
సంపెఁగనూనెయం బొ నొకచంద్రనిభానన కంసవైరికిన్. [illegible]

ఉ. *తామరడోయలో దగిలిదాఁటెడు తేఁటులువో లెబెన్నెఉల్
వేసులు చేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులం
గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగనీ రెడఁ జల్లి చల్లి గం
ధామలకంబు వెట్టె నొకయంగన కాళియనాగభేదికిన్. 1[illegible]

* తామరదోయిలోఁదగిలి దాఁటెడు తేఁటులఁబోలఁ.

మ. చెలువల్గొందఱు హేమకుంభములతో జేసే నొసంగన్నవని
ర్మలదోర్మూలరుచుల్వెలిం బొలియఁ దోరంబైనచన్దోయిసం
దోలయన్వెనలిజాఱనిక్కి యఱమే నొయ్యార మైపాఱఁగా
జలకంబార్చెలతాంగియొయ్యుటు యదువంశస్వామికిన్వేడుకన్.

సీ. చంద్రికపూవన్నె జిలుఁగుదువ్వలువను
దడి యొత్తె నొక్కకాంతాలలామ
కొనగోళ్ల నెఱులు సిక్కులు వాపి మెలపున
శిర సార్చె నొక్కలేఁజిగురుఁబోఁడి
వెన్నెలనిగ్గులు వెదచల్లెడుమడుంగు
లందిచ్చె నొక్కపూర్ణేందువదన
నవరత్నమయభూషణవ్రజంబులు మేనఁ
గీలించె నొకరాజకీరవాణి
తే. విరులసరు లిచ్చె నొకయరవిందగంధి
యలఁదెఁ జందన మొకధవళాయతాక్షి
సుదతి యొక్కతె కపురంపుసురటి విసరె
నిలువుటద్దంబు నొకయింతి నిలిపె నెదుట. 12

క. కలికినిడువాలుఁగన్నుల
తళుకులు మణిదీపశిఖలుఁ దడఁబడ లక్ష్మీ
నిలయున కిచ్చిరి కొందఱు
నెలఁతలు మౌక్తికవిచిత్రనీరాజనముల్. 13

మ. జలకం బాడి మడుంగు గట్టి మణిభూషాదీప్యమానాంగియై
కలశం బెంతయు వింతగా నలఁది చెంగల్వల్జెన్మించ వే
నలిఁ గీల్కొల్పి పసిండియందెరవళి న్రాయంచ లంతంత రాఁ
జెలులుండానునుసత్యభామసను దెంచెన్నాథుఁడుప్పొంగఁగన్.

సీ. మాత్సర్యఘనమేఘమాలికాపగమప్ర
కాశితహిమధామకళ యనంగ
విరహనిశీథినీవిరమసంప్రాపితో
న్మీలనామోదపద్మిని యనఁగ
క్రోధదంతావళక్షోభవిభ్రమపున
స్సంజాతనైర్మల్యసరసి యనఁగ
సంతాపనైదాఘసమయనిర్గతకోర
కితనవమాలతీలతిక యనఁగఁ
తే. గాంతిఁ జెన్నారి వికసితస్వాంత యగుచుఁ
గలఁక యెంతయు నిగఁద్రోచి చెలువ మెసఁగఁ
జేర వచ్చినప్రియభామ గారవించి
యున్నయత్తఱి మురవైరిసన్నిధికిని. 15

క. చను దెంచెఁ గలహభోజన
ముని రుక్మిణి పీడుకొల్ప మున్నీటిజలం
బున మజ్జనాదిమాధ్యం
దినకృత్యము లాచరించి నిష్ఠాపరుఁడై. 16

చ. అతనికి సత్యభామయు మురాసురవైరియు నాతిథేయస
త్కృతు లొనరించి యుండఁగ సతీమణు లిద్దఱు పళ్లెరంబు వె
ట్టితి మని విన్నవించినఁ దటిల్లతయు న్జలదంబు యామినీ
పతి వెనుకొన్నకైవడిఁ దపస్వియుఁ దామునుభుక్తిశాలకున్.

మ. చని గారుత్మతరత్నపాత్రికలఁ గంసద్వేషి సాంబాదినం
దనులు న్సాత్యకిముఖ్యసోదరులు నానాబంధుసంతానముం
దనమ్రోల న్వసియింప మౌనిపతి చెంతం దాను నర్హాసనం
బున నుండె న్భుజియింప వీవనల నంభోజేక్షణ ల్వీవఁగన్.

సీ. శాకపాకంబులచవులు వక్కాణించు
గతిఁ గంకణంబులు గల్లుమనఁగ
నతివేగ మిడుఁడు మీ రనుమాడ్కి మేఖలా
కీలితరత్నకింకిణులు మొరయఁ
గలమాన్నరుచితోడఁ గలహించుజాడ దు
వ్వాలువపింజలు ఘెళఘెళ యనంగ
నారగింపుఁడు మీర లని ప్రియం బాడెడు
పోలుపున మెట్టియ *ల్గులుకరింప
తే. నలరుఁబోఁడులు వడ్డింప నచటఁ గలహ
భోజియును దాను బహుభక్ష్యభోజ్యలేహ్య
చోష్యపానీయముల మధుసూదనుండు
సారెఁ గొనియాడుచును వేడ్క నారగించె. 19
తే. వామనేత్రాకరాంచలావర్జ్యమాన
కనకభృంగారకర్కరికాముఖాగ్ర
గళితగంధోదకంబులఁ గంసవైరి.
చేతులను †వార్చె బాంధవశ్రేణితోడ. 20
క. అప్పుడు తాంబూలంబులు
గప్పురమును జాలవల్లికలఁ బడఁతులచే
నిప్పించె బంధుకోటికి
నప్పద్మదళాయతాక్షుఁ డంతట సతియున్. 21
తే. అంతిపురమున నుచితకృత్యములు దీర్చి
చంద్రశాలాస్థితుం డైనసత్యారికడకు
సంతసంబున వచ్చి ‡యాసంయమీంద్రు
నడుగులకు నెఱఁగుడు నతఁ డాదరమున. 22

* గిలుకరింప. †దార్చు. ‡వాచంయమీంద్రు, నడుగుల కెఱంగుడునునతఁ.

వ. ఇట్లనియె. 23

మ. పతి నీవై విహరింపఁగా జనము సంభావింపఁగా బంధుసం
తతి నిన్నుంగొనియాడఁగా సవతికాంతల్చూచి లజ్జింపఁగా
నతులప్రాభవవైభవోన్నతుల ప్రోవై యిట్లు వర్తించునీ
కితరస్త్రీజనబుద్ధి దీవనలు నే నే మిచ్చెద న్మానినీ! 24

మ. అనికైనం బతి నిన్ను బాసి చనునో ప్రాణంబు ప్రాణంబుగా
నినుమన్నింపఁడొ నీమనోరథములన్నె య్యంబుతోఁ జేయఁడో
చనవు ల్నీవలె నెవ్వరేఁ గనిరొ నీసౌభాగ్యమింతంతయే
నినుఁబోలంగల రబ్జగంధు లన వింతే యొందు సాత్రాజితీ.

క. అటులైనను గాని మ్మో
కుటిలాక! నీకు మగఁడు గోరినకోర్కుల్
ఘటియించుఁగాక తా నెం
తటికార్యంబైన *డించి నాదీవనలన్. 26

క. అని పలికి శౌరిఁ గనుఁగొని
దనుజాంతక! పోయివచ్చెదను మఱవకుమీ
నను నాపుడు గోపవధూ
జనవంచకుఁ డనియెఁ గార్యసంఘటనేచ్ఛన్. 27

చ. అదితి మొఱంగి కుండలము లానరకుండు హరించె వానినేఁ
గదనములోనఁద్రుంచి యవిగైకొనిదాఁచితినాఁటనుండియుం
బదిలముగాఁగ నన్నడుగఁ బంపనికారణమేమి లాఁతినే
యి దెచను దెంచియిత్తునను మీఁకతమున్యనితోడసంయమీ!

చ. అని వినయంబుతోడఁ గలహాశనసంయమి వీడుకొల్పి యం
గనయును దాను నచ్చట జగత్పతి జూదపు వేడ్కనున్న చో

*దీర్చి.

దినకరమండలం బపరదిగ్గిరికూటముఁ జేరు *యావనీ
జనమది రారసారుణవిశాలదృగంచలవంచకచ్ఛవిన్. 29

సాయంకాలవర్ణనము.

ఉ. ఆయతతేజము ల్దఱిఁగి యంబుజబాంధవుఁ డస్తసీమకుం
బోయినఁజూచి† లేచినతమోనిభుఁ డంప దినాంతయోధుఁ డీ
చాయఁదదీయపత్నిఁ బెలుచం బడనీడిచికొంచుఁ బోయెడుం
గో యనుమాడ్కి ‡నంతటశకుంతరవంబు సెలంగె నెల్లెడన్.

చ. ఇను దెసఁ జూడ నోడి తల లెత్తక నీటఁ దదీయబింబముం
గనివగఁజక్కవల్లొగ మొగంబులు సూచుచుఁగుంది మూర్ఛఁజెం
దిన దెసఁజూడలేక జలదేవత హా! యని కన్ను మోడ్చెనా
వనరుహముల్ముడింగెసహవాసులదుఃఖము నెయ్యురోర్తురే.

చ. తనువున నంధకారపుమదం బల మిన్న సుభద్రదంతికిన్
మొనసినఁ జింద రేఁగి తపనుం డనుమావుతుఁ గ్రుంకు మెట్టులో
య నురలవైచినన్గెలి యచ్చట నెత్తుట గ్రక్కెనో యనం
గనుఁగవ గోరగింపఁ బొడకట్టెసముజ్జ్వలసాంధ్యరాగముల్.

క. ఒకభృంగంబు పరారిసీమదనతంత్రోన్మాది ప్రాణేశ్వరిన్
మకరందాసవమత్త నబ్జగృహసీమం బెట్టి తాఁ బోయి సం
జకడ న్వచ్చి తదానమున్ముకుళ మేజాడం జొరన్రాక యా
మికుఁడో నాఁ దిరిగెం గొలంకురమున న్మేలెంతహీనంబొకో.

అంధకారవర్ణనము.

. దినవారిరాశి మాపనుమానిఁ గ్రోలంగ
నడుగునఁ గనుపట్టునసలనంగఁ
గ్రుంకుమెట్టడవిఁ గాల్కొనినసంధ్యావహ్నిఁ
బొడమినదట్టంపుఁబొగ యనంగఁ

* ఘూర్జరీ. † వేచిన. ‡ నత్తటి.

ధనమణి పడిపోవ ధరణీతలంబున
నెదకంగ వచ్చిననింగి యనఁగ
నలచుక్కలనెడి యెడివలరాజుగెలుపు వ్రాల్
వ్రాయఁగఁ బూసినమషీలేప మనఁగ
తే. వృద్ధవారవిలాసినీవిసరమునకు
నపలితంకరణౌషధం బనఁగ జార
నలినముఖుల కదృశ్యాంజనం బనంగ
నంధకారంబు జగ మెల్ల నాక్రమించె. 34

సీ. చిలుకతేజీను నల్లచెఱకువిల్లును గల్వ
విరితూపు నిత్తుము మరుఁడ! నీకు
వనమాలికయును నూత్నవంశనాళమును బిం
ఛము సమర్పింతుము శౌరి! నీకుఁ
గప్పుఁగప్పడమును గస్తూరియును గాటు
కయు నివేదింతుము కాళి! నీకు
నేరేడుఁబండ్లును నీలచామరలు దూ
ర్వలు నొసంగుదు మిభవక్త్ర! నీకు
తే. నిట్టిలోకోపకారికి నిరులువోరకుఁ
జంద్రసూర్యాదిదుర్దోషశాంతి వొదలి
నిత్యత వహింపఁ జేయంగ నేర్తు రేని
యనుచుఁ బ్రార్థించి రభిసారికాబ్జముఖులు. 35

చ. మొనసినదీపికానికరము ల్గృహకార్యగతాభిసారికా
వనితలయూర్పుగాడ్పులనెపంబునఁ గంపమునొంద నోడకుం
డని తిమిరంబు తా నభయహస్తము లిచ్చె ననంగ వానిపైఁ
గనుఁగొనఁ బొల్చె నంకురితకజ్జలము ల్నవధూమమాలికల్,

నక్షత్రవర్ణనము.

సీ. కారొక్కన్నకటికిచీఁకటి మొగుల్మొత్తంబు
గురిసినవడగండ్లగుంపు లనఁగఁ
గవజక్కవలు వాయఁ గరనాళములఁ జందు
రుం డూఁదుపటికకంపుటుండ లనఁగ
నెల్లెడ మిన్నేటియిసుమున నచ్చర
కొమ లిడ్డ వెన్నెలకుప్ప లనఁగఁ
దెలివి వెన్నెలవెండితీఁగలు నిగిడించు
చదలుకమ్మచ్చుబెజ్జము లనంగ
తే. జగము గెల్వంగ దండెత్తుమగనిమీఁద
లీల రతి చల్లుదివనఁబ్రా లనంగ
వేఁడివెలుఁ గెండఁ గ్రాఁగినవిన్ను మేన
*నెక్కొను చెమటబొట్లు నాఁ జుక్క లమరె. 37

చంద్రోదయాదివర్ణనము.

ఉ. యామవతీకళత్రుఁ డుదయావసరంబునకంటెఁ బాండిమ
శ్రీమునుదోఁచెఁ దూర్పుదెససిద్ధముకృష్ణుఁడు పారిజాతముల్
భామినికై హరించునని పాయనిసెవ్వగ నింద్రరాజ్యల
క్ష్మీముఖమండలంబున వసించినవెల్లఁదనంబుకై వడిన్. 38

సీ. కెరలి చీఁకటిమ్రాను గెడపంగ నిక్కిన
సమయగజంబుదంతము లనంగఁ
జదలు గేదఁగితూర్పుతుదకొమ్మ నరవిరి
యై కానిపించుపూరేకు లనఁగఁ
బొడుపుగుబ్బలి నేలపురిటింటియిడుపునఁ
జఱచినగందంపుఁజట్టు లనఁగ

* నెక్కొనిన చెమ్మబొట్లు.

మరునిముందఱ బరాబరి సేయుకంచుకి
కులముచేతుల వెండిగుదె లనంగఁ

తే. గైరవములకు వెన్నెలనీరువరవఁ
బూని చేర్చినపటికంపుదోను లనఁగఁ
గ్రమముతో శీతకరమయూఖములఁ గాన
భాగమునఁ గొన్ని యల్లనఁ బ్రాఁకుచెంచె. 39

తే. అమరు లమృతాంబునిధిలోని యమృతరసము
వెండిచేరులఁ బటికంపుఁగుండ కట్టి
చేఁదుకొనియెదరో నాఁగ శీతరోచి
మెఱుఁగుమెయితోన యల్లన మిన్ను ప్రాఁకె. 40

చ. అమరులబోనపుట్టిక సహస్రమయూఖునిజోడుకోడె సం
తమసము వేరువిత్తు కుముదంబులచక్కిలిగింత పుంశ్చలీ
సమితికిఁ జుక్కవాలు నవసారసలక్ష్మీవోలంగుబావ కో
కములకుగుండెతల్లడము కైరవమిత్త్రుఁడు దోఁచెఁదూర్పునన్.

ఉ. [*పొందుగఁ బశ్చిమాబ్ధితటభూస్థలి నంశుమదంశుమత్ఫలా
కందము వాసరాంతహాలికప్రవరుం డిడ సాంధ్యవారిభృ
త్కందళముల్దమోదళయుతంబులు నైగొలపండి ప్రాలెఁబూ
ర్ణేందునిపేరఁ బ్రాచి నది హేతువు వెన్నెలకల్మికల్మికిన్. 42

చ. సమయవిలాసి శోణమణిసంగతమౌక్తికచారుహారముం
గ్రమమున గ్రుచ్చుచోనరుణరత్నముదామునుసాంధ్యరశ్మిసూ
త్రమునఁ బొసంగగ్రుచ్చియెడతప్పునఁద్రోచిపిఱుందఁజేర్చుము
త్తెముక్రియఁదోఁచెనయ్యమృతదీధితిలాంఛనరంధ్రసంగతిన్

* ఈకుండలీకరణములోనిపద్యములు పెక్కువ్రాఁతపుస్తకములలోఁ గానఁబడవు.

చ. దినపరిణామలక్ష్మికిఁ బ్రతీచి తగం గయిసేయువేడుక
న్వనరుహమిత్త్రబింబ మనువర్తులలాక్షికపట్టికం బయో
ధినడుమఁ దోఁచి సాంధ్యనవపిష్టరసంబు హరించి పాఱవై
చినవెలిదూది యో యనఁగ శీతకరుం డుదయించె నత్తఱిన్.

మ. కడఁక న్రేచలిగట్టుపట్టిఁ దను వేశ్యం గూర్చ నేతెంచి పై
జడిగాఁ జుక్కలతూపు లేయఁ గినుక న్జాబిల్లి ముక్కంటి దాఁ
బోడుపుం గెం పను వేఁడికంట నియ లన్పావిల్తు మే నేర్చి చో
ప్పడఁ దద్భూతియ లం దెనా నపుడు బింబం బొప్పెఁ బాండుద్యుతిన్.

చ. తొలుమలజాతితో నొరయుతూపుఁదొయ్యలిముత్తియం
పుఁగుం,దలమున మానికంబు పడినం గనుపట్టెడు లక్కగూఁడు
నాఁ,జలువల తేనియప్పాదుపుఁ జాయఁ దొఱంగిన కందు దోఁచె
రే, చెలువ కనుంగవం గమియఁ జెంపెన కాటుకకప్పు కైవడిన్.

మ.*అమృతంబాసవమంగ రాగము దయోద్యత్కాంతి చేలంబు చి
హ్నము నుం గాశశి రేపతీరమణుఁ డున్మాదంబు మీఱంగ మో
యమున న్భంగము నొంది పాఱఁ గర సీరాలోడితం జేయ వ
చ్చె మరుద్వాహిని దానిఁ దేర్పననమించెం జంద్రికాపూరముల్

తే. తారకాధీశుకిరణకదంబకంబు
చిలికెఁ బలుచనివలిపంపుజిలుఁగు మంచుఁ
గైరవశ్రీవధూకరగ్రహణవేళ
వెలికిఁ గ్రమ్మినసాత్త్వికస్వేద మనఁగ. 18

సీ. విరహులమైఁ బోఁకి వేఁడి యా వెన్నెలఁ
బచ్చివెన్నెల నులివెచ్చఁ జేసి
కలువపుప్పొళ్ల చేఁ గసటైనవెన్నెల
వలిపవెన్నెలలోన వడిచి తేర్చి

* అమృతాఖ్యాసవ.

చంద్రకాంతపునీట జాలైనవెన్నెల
మదురువెన్నెల జొబ్బఁ బదను చేసి
సతులమైపూఁతం బిసాళించువెన్నెలఁ
దనువువెన్నెలరసాయనము గూర్చి
తే. చిగురువిలుకానిజాతర సేయఁ బూని
కోలముసాముల నందఱఁ గూడఁబెట్టి
వంతు గలయంగ బువ్వంపుబంతివిందు
పెట్టి రెలమిఁ జకోరపుంబేరటాండ్రు. 49

సీ. కామినీమానమేఘశ్రేణి విరియంగఁ
దొగతెల్లుగుంపులు దొంగలింప
సాంధ్యరాగావిలచంద్రికాంబులు దేఱి
నిరులుమొత్తపుటస లివురఁ బాఱ
యువజనరాగపయోరాసు లుప్పొంగ
వెలిదమ్మిజాజిపువ్వులు ముడుంగ
మదచకోరమరాళమండలి చెలరేఁగఁ
బఱచుచేడియ లనుమెఱపు లడఁగ
తే. నభినవశరత్సమాగమం బనఁగ మించు
నట్టిరాకానిశావేళ నలరువింట
గొనయ మెక్కించి వలరాజు కినుక మీఱ
విరహిజనములపై దండువెడలె నప్పుడు. 50

మ. అనలినాయతతాతగడియారమునం దభిసారికాజిఘాం
సానిరతప్రసూనశరచాపగుణధ్వనులో యనంగ ఘం
టానినదంబు లయ్యెడ వినంబడియెం గుపితాబ్జలోచనా
మానసముల్చలింపఁ బ్రథమప్రహరాపగమప్రశంసులై.

### చంద్రికావిహారములు.

చ. వలిపము గట్టి హారములు వైచి పటీరము మైనలంది జా
దులు నెఱిఁగొప్పునందుఱిమి త్రోఁవనెపోయితి మేని దాఁకియుం
దలఁచెడువారు లే రని మనంబుకలంకలు దేర్చి జారకాం
తల సమయస్థలంబులకుఁ దార్చిరి దూతిక లట్టి వెన్నెలన్. 52

వ. వెండియుం దుహినకరమండలంబునం గురియునప్పుడు వెన్నెలలు సాయంతననటనచటులమహానటవికటాట్టహాసభాసంబుల కనుప్రాసంబులై, పూర్వపారావారపులినతలవిహారమాణైరావణకరపుష్కరోద్ధూతవాలుకాఘూళిపాళికలకుఁ బ్రత్యాదేశంబులై, యంధకారబలీంద్రనిర్బంధనధురంధరసమయమధుమథనచరణాంగుష్ఠనిష్ఠ్యూతగగనసరిదంబుపూరంబుల కనుబింబంబులై, చంద్రకాంతమణినిర్మితహర్మ్య§హిమవన్మహీధరశృంగపతితంబు లగుచుం బెనువెల్లువలు గట్టి, యతివిషమమానినీమానప్రతీరంబు లురులం ద్రోయుచు, వియోగవేదనాభరాక్రందద్రథాంగకంఠకుహరకుహరముఖంబుల ముంపుకొని *మెఱయుచు, నరవిరిచెందొగమొగడలం బడి †సుడియుచుఁ, ‡పసుకరువలిం గదలువిరులం దొరఁగుపుప్పొడితిప్పలం బొరలి తెట్టువ గొంచుఁ, గనకడోలావిహారలీలాయత్తనుత్తకాశినీకపోలధాళధళ్యంబుల §పెల్లునం గడలుకొని యుప్పొంగుచుఁ, గటికిచీఁకటితరులం దెరలం జేయుచు, సకలభువనతలాప్లావనంబు గావించి, యజాండకరండంబు $వెండిజలపూఁతగావించిన తెఱంగున నంగీకరించె నప్పుడు దమయందు నెప్పుడెప్పుడు

* మొరయుచు. † సుడిగొనుచుఁ. ‡ జిఱుకరువలిం. § పైజల్లువం..
$ వెండిజలపోసనంబు.

నింతురో యనుచు నువ్విళ్లూరుచందంబునఁ జంద్రికాకిరణ
కందళికలం గరంగురేవెలుంగురాచిప్పలం గప్పురంపుఁగు
ప్పలం గొప్పరించినసరసమధురసంబులు నించి యించిన
వేడ్కల నొండొరువులకెంజిగురాకుమోవినంజలం జవిగొ
నుచుఁ గ్రోలి సోలి పూఁజవికలఁ బొంపిరివోవుకామినీకా
ముకులును, వలరాచకేలి సలుపునెడల *నంగంబులచకచ
కలు వెలివోవకుండ నిండార లేపంబులు సేయువొప్పునఁ గ
ర్పూరకస్తూరికాసంకుమదమిళితచందన పంకంబు లొకొళ్లొ
కళ్లమేనులం గలయ నలందుకొని చలువచప్పరంబులం
దీర్చిన పుష్పాడితిన్నెల విశ్రమించుసతీపతులును, ప్రోఢ
లగు నెచ్చెలులు జీరాడుసిగ్గు నీడిగిలంబడ నెట్టకేలకుఁ
ద్రోపు ద్రోపాడుచుం దార్చి కూర్చి మరలుటయు మరుం
డొనర్పఁగలకోర్లలకుం దివురుతమకపుముంగలిపోఁజూలునిగి
డించుక్రొవ్వాఁడితూపులరూపున నొండొరువుల మఱు
పెట్టిచూచునెలగోలుచూపుల నితరేతరధైర్యంబులు గంటి
వడ నొంటి బచ్చెనయోవరుల వసియించువధూవరులును,
బేరుకొనుకోరికలు దారుకొన డాయునెడం బొంగినయుం
గంబులం బరస్పరబాహుపాశంబుల బిగియారం గౌఁగిలించు
కొని కరంగినడెందంబుల రెంటి నొక్కటిగ నర్తించుపోలిక
నర్తమిల్లి పగలు తమపాసిన †యెడలం బొడముమనోజవికా
రంబుల నవిరళతరకపోలంబుగాఁ జెప్పికొనుచు హంసతూలి
కాతల్పంబుల నల్పేతరానందంబులం బొరలుతరుణీతరుణు
లును, దొలుతటిపొలయలుకయెడం జనించినవియోగ
శిఖి నిండారు రేయెండవేఁడిమి నగ్గలించినం దాలిమి దెమలం

* నందంబులతెగలు పొలివోవ. † యడలునం బొడముచెయ్వులనవిరళ.

దమక తామ తమకించి కలసికొని నెచ్చెలులకా బేలువెట్టి తొట్టినవేడ్కలం బొదరిండ్లకందువలం బొదలురమణీరమ ణులును, వబ్బుకొను వయసు *గుబ్బల నిబ్బరంబుగ నివ్వడు తివుటలం బెచ్చు పెరుఁగుమచ్చరంబుల నొక రొకరి మెచ్చక పచ్చవిలుతుండు విచ్చలవిడిందనకై దువుఖుముప్పది రెంటం దోడుసూపె నన బహువిధకరణాసన భేదంబులం బెనఁగుచు మణిసౌధంబులం గ్రీడించుయువతీయువజనంబు లును, గ్రిక్కిఱిసిన మక్కువల నిక్కువలఁ గమియం †జొక్కులచెయ్వులఁ ద్రొక్కుడు‡వడిరతిశాస్త్రరహస్యతత్త్వాను భవంబున వెలి మఱచినవలరాచతపసుల పోలికం దెలి రాకట్టునెలవులం బవ్వళించి యున్ననాయికా నాయకు లును, నెడపడని వేడుకపనుల నలసి జడియునవయవంబు లపై సొలయునెమ్మనంబులతో నొయ్యనొయ్యనం గదలు తూఁగుటుయ్యెలలం గన్ను మొగిచియున్న విలాసినీవిలాసు లునుం. గలిగి యన్నగరంబు శంబరాంతకుసామ్రాజ్యంబు ననుకరించె; నయ్యెడ నయ్యదువల్లభుండు సత్యయుందాను ననర్ఘ్యమణిదీపితంబును విమలదుకూలవితానసందానితం బును బ్రాలంబముక్తాగుళుచ్ఛచ్ఛవిచ్ఛాదితవలభివిలసితంబు ను వివిధ విచిత్ర పటఘటిత స్ఫటికభిత్తిభాగభాసురంబును మృదుల హంసతూలికాకల్పితతల్పసంఛన్న మణిమంచకాం చితంబును ధవళ ఫణిలతాదళక్రముకఖండ మండితమరకత మణిభాజనవిభ్రాజితంబును మృగమదమిళితపటీరపంకాంకిత మౌక్తికశుక్తిపరికల్పితంబును దరవికచలతాంతతాలవృంత కాంతంబును గోమలబిసతంతుసంతాన నిబద్ధకుసుమదామ

* గబ్బుల. † జిక్కులు. ‡ వడ నన్నుకొనివలరాచ.

రమణీయంబును సురభికృష్ణాగరుధూపధూపితంబును బరి మళమిళితశిశిరసలిలపూర్ణ కనకగళంతికా సముంచితంబును మంజుగుంజత్పారావతపతంగగళరవభరితంబును మాణిక్య సమున్నతాదర్శ దర్శనీయంబును నగు శయనాగారంబున వినోదకేలిం దేలి నిద్రాముద్రితనేత్రుండై శయనించె నయ్యవ సరంబున. 53

మ. నలినాప్తుండు మదీయబంధు లని తా నక్షత్రసంఘంబులం గలఁప న్వచ్చుచు నున్న వాఁ డనుచు మున్గల్గంగ నాత్మీయశి ష్యులమం దేహులఁబోరొనర్పఁజనుఁడంచుంబంపెనో లెంచెనాఁ బొడమెన్వేగురుఁజుక్క కాలఫణభృద్భోగోల్లసద్రత్నమై. 54

—శ్రీకృష్ణుని మేల్కొలుపు.—

క. వైతాళికు లప్పుడు మృదు, గీతామృత వచనరచనగీలుకొన యశో, దాతనయు మేల్కొలుపఁ బ్రా,భాతికరమణీయ రాగఫ ణితులు *సెలఁగెన్. 55

మ. జయ గోవింద ! ముకుంద! చక్రధర! కంసద్వేషి! సాత్రాజితీ ప్రియ! నారాయణ! కౌస్తుభాభరణ! కుంభిప్రాణహారీణ! కా ళియదర్పఘ్న! పతంగవాహ! వనమాలీ! కృష్ణ! వైకుంఠశౌ రి! యశోదాత్మజ! భక్తవత్సల! మురారీ! గోపికావల్లభా!

మ. శరధిక్రోడనివేశ! శార్ఙ్గధర! శిష్టధ్యేయ! శీతాంశుభా స్కరనేత్రద్వయ!శుభ్రపంకరుహభాస్వన్నాభ శోణాంఘ్రియా భరణా! శేషశయాన! శైలధర! శోభారమ్యసర్వాంగ! శౌ ర్యరసోదంచిత! శంఖచక్రధర! శర్వాణీసహాయప్రియా! 57

క. మేల్కనుము దేవ! యివెరా
చిల్కలు కను మొగిచియున్న చెలువలఁ దమకం

* బొలిచెన్.

బల్కులు నేర్పఁగ ముద్దులు
గుల్కెడు పల్కులను మేలుకొలిపెదుఁ గృష్ణా! 58

సీ. చరమాద్రిదావాగ్ని సంప్లుష్టసురసౌర
భేయీకరీషైకపిండ మనఁగ
బహుచకోరకదంశపరిపీతచంద్రికా
క్షౌద్రనీరసమధుచ్ఛత్ర మనఁగఁ
బ్రత్యఙ్ముఖోచ్చలద్ధాత్రివర్షీయసీ
పలితపాండురకేశబంధ మనఁగ
గగనసౌధాలేపకరకాలశిల్పిని
ర్ముక్తసుధా *వష్టముష్టి యనఁగ
తే. సుమహితజ్యోత్స్నికాలతాసుమగుళుచ్ఛ
మనఁగ నతిఘనసరచ్ఛాయ నబ్జవైరి
చెలువు వోకాడి బింబావశిష్టుఁ డగుచు
నల్లనల్లన వ్రాలెడు నంబుజాక్ష! 59

చ. జలరుహమిత్రుఁ డాత్మరుచిసంపదఁ జీఁకటిబందెకానికిం
గలఁగుచు వీనిలోన నిడి కైకొని నమ్మికకాఁపు లంపుఁ జొ
క్కులవారయొంపదాడిపిని గ్రక్కునఁదాను గాంతి వీనిలో
పల నెలకొల్పె నాఁ బలుకఁ బాతె నిశాంతనిశాంతదీపముల్.
మ. దరమీలన్నయసంబులై గృహబహిర్ద్వారంబులన్యాయమునం
జరము ల్గండమువభ్రముచ్ఛ్రిమురికాంచుంకాంచనంగితపు
స్ఫురణ లూన్పుచుఁ గప్పతాళనినదంబు ల్గ్రించ నీపూగఘో
త్కరముం బోలుచుఁ జూపనొప్పెనివెహాస్తన్యాయముల్ డం
మ. సమయాభీరకుమారుఁ డేర్పునఁదమిస్రాయానక్షేంచరిం [గణ.
గమలారిస్తనమండలాంకవిపులసంక్రాంతప్రభాముగ్ధనల్

*మృష్ట ముష్టి

రముతోఁ రూపఱఁజేయశోషిలుచుఁదారల్మోలనిట్టూర్పుసాం
ద్రముగానూర్చెననంగబెల్లెసఁగెఁబ్రాతఃకాలవాతూలముల్

క. మంచునఁ దోఁగినపల్లవ
సంచయము భవద్వియోగసంతాపరుద
చ్చంచలనయనాబాష్పక
ణాంచితబింబోష్ఠలీల నలరె నుపేంద్రా! 62

తే. కమ్మకస్తురిగుళికలు తమ్మిలేమ
నిదురమంపునఁ బుక్కిట నించి మేలు
కాంచి వేసిన నుమిసె నాఁ గమలముకుళ
కోటరంబుల నెలదేఁటికొదమ లెగసె. 63

మ. వినవయ్యోం గృకవాకుకూజితము లుద్వేలంబులై సూరసూ
తనవోద్యత్కరకుంచికావిఘటితధ్వాంతారరక్షక్రియా
స్వనము లైకరవిణీప్రసూనస్పృథుకస్వాపక్రియాడోలిక
ల్దినకృన్మార్గనివారణత్వరితమం బేహాగ్రసింహధ్వనుల్. 64

తే. రాజు వీడెత్తిచనినఁ దారకభటాలి
యంబరాభోగనిజ †శిబిరాంగణమునఁ
గాలుకొల్పినపావకజ్వాల లనఁగఁ
బ్రాచిఁ గనుపట్టె నవసాంధ్యరాగరుచులు. 65

తే. కమలినీజృంభికలకు దిక్కాంత లెల్ల
హస్తతాళంబు లొనరించి రనఁగఁ జెలఁగె
లలితకాసారకూలకులాయచలిత
శకునపక్షజపటపటస్వనము లధిప. 66

సీ. యామినీసమయంబు నాశాతటప్రదే
శంబుఁ బ్రసన్నభావంబు నొందె

* ధ్వాంతారరక్షోంకక్రియా. † శిబిరాంచలమునఁ.

బ్రియచుంబితాంగనాబింబాధరంబులు
నుడురాజునపరాగయుక్తిఁ దోఁచె
నఖిలవస్తువులుఁ బ్రాగచలకూటవిటంక
తలములు నతిరోహితంబు లయ్యె
నుత్తుంగపురగోపురోపరిస్థలులు సా
రసములు నాత్తసౌరభము లయ్యెఁ
తే. దరుణగోతర్ణకంబులు సురపథాంత
రంబులును విచ్యుతప్రగ్రహంబు లయ్యె
నియమపరతంత్రభూదేవచయముఁ గౌశి
కవ్రజంబు సమాధియోగమునఁ బరఁగెఁ. 67
మ. కమలాప్తోన్నమదంశుజాలములు దిగ్భాగంబులం గ్రమ్మినం
గుముదాంతస్థితలక్ష్మి యొండవడ నోఁకు ల్వెన్నఁగా లేక ప
త్త్రముల న్మాటుగఁ జేసి కప్పుకొనియెం దత్కాలసంకోచన
క్రమదంభంబున రాజవల్లభ లసూర్యంపశ్య లౌదుర్గదా. 68
చ. కొలకొల మంచు మేఁతలకు గూఁడులు వెల్వడుపక్షిరావము
ల్కలమృదువాక్యవైఖరులుగా నలవేకువపూవుఁబోఁడి వే
డ్కలుదళుకొత్తదోహదమిడం దొలుగుబ్బలిఁగొండగోఁగుపూ
గొలయలరించె నాఁబొడిచెఁ గోకనదాప్తుఁడుపాటలద్యుతిన్.

—— శ్రీకృష్ణుని ప్రయాణసన్నాహము. ——

వ. అని యివ్విధంబునం బలుకుమాగధులమధురవాక్యంబు లా
కర్ణించుచు మేలుకాంచి యప్పంచశరగురుం డహర్ముఖోచిత
కృత్యంబులు నిర్వర్తించి పురోహితవృద్ధామాత్యసహితం
బుగా నాస్థానమంటపంబున కరిగి యుగ్రసేనవసుదేవబలభ
ద్రాదిగురుజనంబులకు నమస్కరించి సాత్యకిసారణప్రభృతి
సోదరుల నాదరించి ప్రద్యుమ్న సాంబానిరుద్ధాదికుమార

వర్గంబు మ్రొక్కులు గైకొని యదువృష్ణికుకురభోజాంధకప్రము
ఖు లగు బంధుసందోహంబుల సంభావించి సింహాసనాసీనుం
డై తగువారి నుచితాసనంబుల నుండ నియమించి పేరోలగం
బుండి కార్యత్వరానముత్సాహదోహలితాంతరంగుం డై
పతంగపుంగవుం దలంచుటయును. 70

సీ. వజ్రంబునకు నీక వైచినబలశాలి
గజకచ్ఛపాశనఘాతుకుండు
జననిదాస్యంబు నీఁగినకులశ్రేష్ఠుండు
దుర్లభామృతపశ్యతోహరుండు
కమలాప్తసారథిగారాబుఁదమ్ముండు
గశ్యపకృతపుణ్యకర్మఫలము
సకలశకుంతౌఘసామ్రాజ్యధౌరేయుఁ
డహిమృగయావ్యసనాకులుండు
తే. మింటిపాళెంబు లేర్చుముక్కంటితూపు
గతి నిపాతితరోహిణాస్కంధుఁ డనిల
మానసాతీతవేగసంపన్నుండు
తార్క్ష్యుఁ డేతెంచె దానవధ్వంసి కడకు. 71

క. మిన్నుననుండి భరంబునఁ
బన్నగపతితలలు చదియఁబడ ధారుణిమీఁ
ద న్నిలిచి వైనతేయుఁడు
వెన్నునిపదములకు వినయవినతి యొనర్చెన్. 72

చ. మునిపతిరాకయుం గుసుమముం దన కిచ్చినలాగు రుక్మిణీ
వనితకుఁ దా నొసంగుటయు వంచనఁ బొంచినబోటి సత్యకున్
మన మెరియంగఁ జెప్పుటయు మానినికోపము వేడుకొంటయుం
దనదు ప్రతిజ్ఞయుం దెలిపెఁ దార్క్ష్యున కెంతయు నాదరంబునన్.

ఉ. సంతసమంది యాదులు ప్రసాదము నయ్యెనటంచు బొంగి నా
గాంతకుఁ డంబుజోదర! బలానుజవైరి! మదీయపక్షముం
బంతముగొన్న వాఁ డితని పాతమున న్గను నాఁటనుండియు
న్వాంత వనంబులోఁ జనదు నాఁగ నీఁగెను నేఁడు నీకృపన్.

చ. అనుటయు నంతవాఁడు వెక పా యని మిక్కిలి గారవించి యు
ధ్వనసహాలోచనుండు వగు వారి సుహృజ్జనబంధుకోటిఁ దాఁ
బనిచి నిజప్రయాణమును బట్టణరక్షయుఁ జెప్పి వారిచే
ననుమతిఁ గాంచి యెక్కె విహగాధిపుఁ దానును సత్యభామయున్.

ఉ. ఆవిహగావతంసము నిజాంసముపైఁ బ్రియభామతోడ నిం
ద్రావరజుండు నిల్పుటయు నాతతపక్షసమీరణంబు లం
భోవహసంఘములఁ బోలికఁ దూల్పఁగ నభ్రభాగముం
దైపెను పక్షికిన్నగపు సద్భుతకాంతి మనోజవంబునన్. 76

క. ఇరుగ్రేవల నందకశా
ర్ఙరథాంగగదాయుధములు రాఁ దోఁపఁగ ఖగే
శ్వరపక్షజనితవాతాం
కురపూర్తిని శంఖ మప్పుడు ఘుమఘుమ మ్రోసెన్. 77

తే. అంబుధరజాలము స్తంబు లయిన జలక
ణములు సాత్రాజితీకైశికమునఁ బోలిచె
గగనతలలక్ష్మి పోరచి గాఁగ నిడినఁ
జాల నొప్పారు మౌక్తికస్తబక మనఁగ. 78

క. తళతళని మెఱుఁగుఁదీఁగలు
గలుగుఘనాఘనచయంబు గనుఁగొనఁగా నిం
పొలయించెఁ బసిఁడికాసుల
నలరెడునీలములగొడుగు లనఁగా హరికిన్. 79

క. కమలదళాక్షుని దేహో
ద్వమదతిసాంద్రచ్ఛవిప్రవాహము వోలెం
దమతండ్రి భానుఁ గనుఁగొన
యమునానది గగనవీథి కరిగెడు ననఁగన్. 80

చ. ఖగకులనాథుపక్షములగాడ్పు సహింపఁగ లేక రజ్జుప
న్నగములు దేరి క్రిందికిఁ జన న్సరసీరుహమిత్త్రరథ్యముల్
నొగలఁదొలంగినిల్వనరుణుండు రయంబునఁజక్కఁగట్టుచున్
గగనపథంబునం దఱిమెఁ గాలవిలంబన మందకుండఁగన్.

క. నతి సేసె వైనతేయుఁడు
గతిభేదములోన నన్నుఁ గనుఁగొని యతఁడున్
*గతిలోనన దీపించినఁ
జతురతకు న్మెచ్చి రపుడు సత్యయు హరియున్. 82

క. మురమర్దనుఁ డవ్విధమున
గరుడునిపై గగనపథము గడచి యరుగుచుం
దరళాయతాక్షి కిట్లను
సరసస్మితవచనరచనచాతురి మెఱయన్. 83

కృష్ణుఁడు సత్యభామకు మేరువును వర్ణించిచెప్పుట.

చ. కువలయపత్త్రనేత్ర! కనుఁగొంటివె కన్నులపండువయ్యె రెం
డవవినతాతనూభవునియందమునం గమనీయకాంచన
చ్ఛవికవచీకృతంబు కులిశక్షతపక్షము నైనరత్నసా
నువునిజయామికీకృతవినోదపరాయణచంద్రభానువున్. 84

సీ. జీర్ణపర్ణద్రుసంకీర్ణాహిమణివిభా
మాయాకిసలవంచ్యమానపికము

*మతిలోనన.

శశికాంతపువిస్ఫుటపాసలిలసంక్షాళన
శ్లథవిషాణోద్విగ్నసైరిభంబు
గోమేధికప్రభాంకూరమిథ్యామధు
ద్రవలిలిక్షామిళద్భల్లుకంబు
నీలకంఠప్రస్తరాళీకగజ*భేద
నిర్వ్యగ్రఖక్షుబ్ధసింహకులము
తే. గారుడాశ్మచ్ఛవిచ్ఛటాకపటయవస
†పాలికాచర్వణవ్యగ్రబాలమృగవి
లంఘ్యమానాబ్జరాగశిలావితాన
కూటదావాగ్ని యామరుత్కుధర మబల! . 85

ఉ. వంచనఁ బొంచి చేరువకు వచ్చినచంద్రుని ‡జింక నేసి హ
రించియుఁ దత్సుధారసనిషేచనచే నది చావకున్కి వీ
క్షించియు నేటు దప్పె నని చేవిలు నమ్ములుఁ బాఱవైచి ల
జ్జించి చరించుచుండుదురు చెంచెత లగ్గిరిసానుభూములన్.

వ. వెండియు నప్పసిండికొండ గండశిలామండలంబున నుద్దండ వేదండంబు లొండొండ గండతలంబు లొరసికొన నిండిన మదజలాంజనమషిం గొని వనదేవతలు $భుక్తతాటంకతాళీ దళంబులం బ్రియసందేశంబులు లిఖియించుగంధర్వసౌగంధి కగంధులవలన, నత్యంతనిర్మలస్ఫటికాధిత్యకలం గానవచ్చు పాతాళవాతాశిప్రతిబింబంబులం గని మును తనుకఱచిన యురగంబులం బాఱ విడిచి వానిం దమచంచుపుటంబులం బొడిచియు గరుదంచలంబుల నడిచియుఁ బదంబులం దాఁ చియు నేచినకోపంబుల విఫలప్రయత్నంబు లగు బాలశిఖా

* భేది. † పాలికా. ‡ చింక. $ భుక్తముక్తతాటంక.

పళంబులం గని తమవారలకుం జూపి పరిహసించు గరుడతరు
శ్రేణినివహంబులవలన, సెలయేటిచిలువచిలువనినీరు పగలుగఁగ
నమణి ధగధగనికిరణముల మిగుల సెగ లెగయు రవికాంత
శిలాతలంబులం దెకతెక లుడుకెత్తి జాలువాఱఁ గరంగిన
కజ్జలవ్యాపికోలంకులం బడి కెలంకులం దేలి తెట్టువలుగట్టి
చపలకపికులచలితతటతరుపతిత కుసుమవిసర పరిమళ పరం
పరావాసితం బై ఘుమఘుమం బిసాళింప నలందుకొని రతి
శ్రమంబు లపనయించుయక్షపక్ష్మలాక్షులవలనఁ, గేసరికిశోర
నఖముఖవిదారితకుంభం బై నవనగజంబును వనగజదంతఘాత
యాతనాభ్రాంతవరాహంబును వరాహదంష్ట్రాటంకఖండిత
కీచకనిచయంబును గీచకశిఖాజర్జరిత పర్జన్యంబును బర్జన్యో
దరపరిచ్యుత శంఖశుక్తిసంఘంబును నొక్కయెడన పడఁ
దద్దుత్పన్నంబు లగుమౌక్తికంబుల వేలు వేల నేఱి పేరులు
గ్రుచ్చుసాధ్యమిథ్యామధ్యలవలనను, నభిరామం బై;
మఱియు నొక్కొకచోట సురపతి తఱుచు మెఱుఁగు లడరు
కఱకుభిదురముఁ గొని తఱిమి యెఱకలు విఱుగ నఱికిన
యెడల సెలలకు నిడిన జెలగలపోలుపునంజలుల నెరగొని
పొరలుజరదజగరనికరంబులును, ఖచరగణగోష్ఠీస్థానంబులం
బఱచినరత్నకంబళంబులవిధంబున విశాల శిలాతలంబుల
నిద్రించుశార్దూలంబులును, మృగాంకమండలంబు సగము
కబళించినరాహుగ్రహభూమికలచందంబున నందంద తిరుగు
బొల్లిమోరభల్లూకంబులును గలిగి; సుధర్మాప్రదేశంబునుం
బోలె శక్రపురమహిళాలికుచలికుచచందన సుగంధాగురు
వాతపోతమేదురంబును, జలనిధియునుం బోలె నీల
నలపనసకీలితతుంగసేతుసహితంబును, వల్లకియునుం

బోలె లలితప్రవాళకకుభంబును, భూధరంబునుం బోలె
శతపర్వచయోత్కృష్టంబును, సముద్రతలంబునుం బోలెం గలి
తానేకపాటనంబును, శబ్దశాస్త్రంబునుంబోలె ధాతుగణ
విద్యోతితంబును, సంగీతంబునుంబోలె నిషాదపరిచితంబునయి,
గ్రావనిబద్ధఘనౌఘంబయ్యును నగ్రావనిబద్ధఘనౌఘంబై,
గవయస్థానంబయ్యును నగవయస్థానంబై, హరిణావారా
వాసితంబయ్యు నహరిణావారావాసితంబై, మెఱయు నిది
మఱియును. 87

ఉ. కిన్నరకంఠి! చూచితివె కిన్నరులం గలకోకిలస్వరా
భ్యున్నతశృంగభాగముల సుస్ఫుటగంధములం దారుగల్పకో
త్పన్నమధుప్రసంగతులఁ బాడెడ రింద్రునిమీఁదిగీతముల్
కిన్నర లొయ్యనొయ్య బలికించుచుఁ దాగతదుస్వనంబులన్.

ఉ. ఆయతభూర్జపత్త్రముల నాసురవేశ్యవతిప్రియుల్ ప్రియా
ధేయము లారగించి పద పేర్మిఁగ శీతలకల్పకద్రుమ
చ్ఛాయల నిల్చినిల్చి సరసంబులు పల్కుచు పొందికొంచునుం
బాయక నుండియేఁగెదరు భామిని! చూచితిపు సిద్ధాంగనలన్.

శా. ఏణీశాబవిలోలనేత్ర! కనుఁగొంటే నీవు విద్యాధరు
ల్మాణిక్యోజ్జ్వలరత్నకుండలులు సంబద్ధాసిధేను ప్రభా
ద్వీణాపాణులు చంద్రకాంతశిరోవేష్టప్రపుంప్రాంకితు
ల్వాణీయస్తరతారహారులు శివధ్యానైకనిష్ఠాపరుల్. 90

మ. కనుఁగొంటే సకలేందుబింబముఖి! యోగంధర్వులం బంకజా
సనగేహిన్యుపదిష్టగీతరచనాసర్వంకషప్రజ్ఞలం
గనదుత్తుంగవిమానచారులఁ దురంగగ్రీవుల స్నిగ్ధరీ
జనతాసృష్టసహాయలాలసుల యక్ష*గ్రామణీస్తన్యులన్.

* గ్రావహాస్తవ్యలక్.

సీ. యక్షులు *వీర లోయతివ! మేళము గూడి
పాడుచుందురు దిక్పాలసభల
గుహ్యకు †ల్వీర లో కొమ్మ! హాస్యరసాధి
నాయకు ల్భృంగిశసర్వసఖులు
గరుడులు ‡వీర లోతరుణి! విష్వక్సేన
పరిచితు ల్నాగారిపరమహితులు
చారణు ॥ల్వీర లోసతి! విచిత్రకథేతి
హాసజ్ఞు లఖిలలోకాధ్వనీను
తే. లమరపతిఁ గొల్వఁ జనువార లతివ! యొప్పడు
నుబుసుపుత్తురు వివిధోపయోగ్య §కళల
మనలఁ జూచెద రాశ్చర్యమగ్ను లగుచు
వీరిఁ గనుఁగొంటె గంభీరవేదిగమన! 92

లయగ్రాహి.

అంగన! కనుంగొను మనంగహరనూళితట
రంగనటి జహ్నుమునిపుంగవనిశాలో
త్సంగశిశువుం గపిలునింగలవుఁజూపుసెక
లం గలయునాసగరుపంగతము మోక్షో
త్తుంగమణిసౌధమునకుం గడఁపుఁదాన గగ
నాంగణమహీతలభుజంగనిలయంబుల్
జంగగొను నేర్పరిఁ బతంగజయనుంగుఁజెలి
యం గనఖలాచలయుగంగ సురగంగన్. 93

మ. అవె దివ్యర్షి నికేతనంబు లనసూయాసుంధతీకర్ణపూ
రవివృద్ధార్భకకృష్ణసారగతిసంరంభంబు లింద్రద్రుమా

* వీరుగోయతివ!. † వీరుగోగొమ్మ! ‡ వీరుగోతరుణి! ॥ వీరు గోసతి! § కళల.

క. అని నాకపురమహత్త్వము
వనితకుఁ దెలుపుచును హర్షవశమానసుఁడై
దనుజకులవైరి చని యొ
య్యనఁ గాంచనమేదినీధరాగ్రక్షోణిన్. 100

చ. పతగవిభుండు మింటిపయి భంజలికాముర*ళీసుడాల వ
ల్గితముల చా నెదుర్పడినఖేచరవర్గము లోసరించి య
ద్భుతముగ మ్రొక్క లేనగవుతోఁ గనుఁగొంచు హయాస్యనైచికీ
శితఖురటంకచంద్రకితసిద్ధసరిత్తటమార్గసీమలన్. 101

క. సరసబిసవిసరమువా†రా
హరణోద్ధురహంససంసదారవదీర్ఘ
కరణచణగంధవహములు
శరీరముల సేద దేర్పఁ జనుదెంచె రహిన్. 102

శా. సమ్మర్దక్షమధీనిబంధనవిధాసంక్రందనాచార్య ! సహా
రమ్మన్యాచలవజ్రపాత ! జగతీరక్షాంబుజాక్షా ! శర
ధ్యమ్మార్గస్థదశాస్యరాజ్యసమసహ్యాప్రోద్భవాతీరభా
గుమ్మత్తూరిశివంసముద్రపురవప్రోన్మూలనాడంబరా ! 103

క. తిరుమలదేవీవల్లభ !
కరుణామయహృదయ! రాజకంఠీరవ! యీ
శ్వరనరసభూపురందర
వరనందన! బాసదప్పవరగండాంకా ! 104

స్రగ్విణి.—

నాగమాంబాధిభూనారసింహాత్మజా !
భోగలీలాపరాభూతసంక్రందనా!

* సృతాల. † రు,ద్ధరణో.

త్యాగవిద్యానిషద్యాయిత ప్రాభవా!
సాగరాంతక్షమాసంస్తవైకాస్పదా! 10[illegible]

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధ[illegible]
స్వతాభినంది నందిసింగయామాత్యపుత్ర కౌశికగోత్రపవిత్ర
సుజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతంబైన [illegible]
హరణం బను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము.



మహితగేహా! యుత్కళ
భూమీధవగర్వహరణభుజసార! సుధా
ధామకులజలధికౌస్తుభ!
శ్యామాపాంచాల! కృష్ణరాయనృపాలా! 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
వరున కిట్లను నమ్మునివల్లభుండు
గగనగంగాప్రతీరోపకంఠభూమి
నల్లనల్లన నేతెంచునవసరమున. 2

ఉ. అంతకుమున్న నారదమహామునిచే విభుఁ బంపఁ గాంచి సై
త్యాంతకుఁ డాకడానెఱిఁగి యభ్రమువల్లభుఁ డెక్కి సంభ్రమా
క్రాంతమనస్కుఁడై యెదురుగా జనుదెంచె దయందనుంగుడున్ శ్రీ
కాంతులు మేనఁ గాంచఁగఁ దిశానివహంబులు వెల్గఁగొల్వఁగన్.

స్వర్గమున శ్రీకృష్ణు నింద్రుఁడు సేవించుట.

చ. అమరవిభుండు దూరమున నంబుజనాభునిఁ గాంచి సంభ్రమో
ద్గమమునఁ జేతియంకుశముఖంబునఁ గుంభములుం గదించి తా
త్రిమహచరణంబున న్మదకరిన్ డిగి యంచవిలంబకల్పచే
లను నడుమ న్బిగించుచు నిలానిహితాత్మశిరఃకిరీటుఁడై. 4

చ. జడిగొని నమ్మదాశ్రుకణజాలము లొల్కఁగ రోమహర్షముల్
బడిబడి మేనఁ బాదుకొన భక్తినివేశతరంగితాత్ముఁడై
యడుగులమీఁద వ్రాలె దివిజాగ్రణి తత్కలశంబె సన్మితో
నడిగెడురీతి మాళికుసుమాగతషట్పదపంక్తి మ్రోయఁగన్.

చ. అలఁదినచందనంబు వృథ యయ్యెఁ జెమరింపఁగ సమ్మదాశ్రులన్
దొలఁచినయట్లు వోయెడుఁ గనుంగవ కాటుక బొట్టు లెత్తుఁ జె
క్కుల మకరీవిలాసము గగుర్పొడువ న్హరిఁ జూచువేళ నో
చెలి! కయిసేయకమ్మ యని చేడియయొక్కతె పిల్చె నెచ్చెలిన్.

చ. వనిత యొకర్తు మున్కొని గవాక్షతలంబుననింతులుండుటం
గనుఁగొనఁ జోటులేమి నొకకార్యమువేరిట బాలనొర్తు వం
చనఁ దొలఁగంగఁ బిల్చి రభసంబునఁ దత్స్థితి జాలకంబు జే
కొని హరిఁ జూచెఁ గేకిసలుగొట్టుచు బోటులు దానినవ్వఁగన్.

ఉ. కాళియభేదిఁ జూచుతమకంబున మజ్జన మాడి యాడి నీ
లాలక యొర్తు గంధసలిలార్ద్రకచంబులు చన్నుదోయిపై
వ్రాలిన సందిటం బొదివి రాజపథంబున కేఁగుదెంచె గో
పాలకమూర్తిఁ గాన శిఖిబర్హము కానుక దెచ్చెనో యనన్.

ఉ. ఉన్నతసౌధ మెక్కి యన్నతోదరియొక్కతె పద్మనాభుఁ జూఁ
డ న్నిజదేహవల్లికఁ గడల్కొనుసాత్త్వికకేలిఁ జూచు నా
సన్న సఖీజనంబు గని సౌధశిఖాగమనశ్రమంబునం
గన్నియలార! మేన్బడలెఁ గంటిరె నా కని బొంకె నేర్పునన్.

ఉ. వేడుక నీకె కాని మఱి వేఱొకయింతికి నైన లేదె త్రో
పాడెద *వేల మచ్చర మొకప్పుడు మానక పోయి తీవు పెం
బ్రోడవు గాననిన్నె కనుఁబో యతఁ డెవ్వరిఁ జూడఁ బంచునో
నాఁడె సపత్ని నొక్కతె మురారిఁ గనుంగొను వేళ నీసునన్.

చ. అలికులవేణి యొక్కతె మురారిఁ గనుంగొని త్రాసుపాటుమై
నెలకొన నున్నచో సడలునీవిక లెఁజెను రంట నిల్పె నం
జలిపరిపూర్ణలాజలను సాధ్వసకంపము దాన చల్లె న
చ్చెలువకు సాత్త్వికోదయము చేసిన మేలిఁక నేమి చెప్పుదున్.

* వేలె.

క. మదవతి యొకతె పతాకునఁ
బదాంగదము కంకణముగఁ బాణిఁ దొడిగె న
య్యదువల్లభుఁ గనుఁగొనుడుం
దని నవియుసు మేను వొంగి తుత్తును రయ్యెన్. 18

ఉ. దనుజవిరోధిమీఁద నొకతన్వి కరంబున లాజ లెత్తి చ
ల్లిన నెఱివేణి యాసున బలె న్వారిస్రావులఁ జల్లెఁ జల్లె లో
చనములు సప్పుదాశ్రువులఁ జల్లె లలాటము ఘర్మబిందులన్
జనుఁగవ సల్లె సంభ్రమవశస్త్రుటితామలమౌక్తికాదులన్. 19

చ. జలరుహనేత్రుఁ గాంచి సరసత్వము మీఱఁగ నొక్క వేలుపుం
జిలుకలకొల్కి తాచిలుకచేఁ బిలిపించిన సత్యభామ తా
కలికితెఱంగు శౌరి కడగన్నులసన్నలఁ జూపెఁ గోపకం
దళకలుషాయితాక్షివలనంబుల నాసతి దన్నుదల్పఁగన్. 20

క. అనిమిషపురజాలకములు
వనితాజనతామయములు వనితలహృదయం
బను రాగరసమయం బ
య్యెను రాగము శౌరిమయము నయ్యెడ నయ్యెన్. 21

చ కనుఁగొన వేడ్కలం బొడము కాయ్వుల నచ్చరలీసడించుట
ల్వినుచు వరస్మితం బొలయ వెన్నుఁడు రాజపథంబు దాఁటియ
య్యనిమిషనాథుగేహబహిరంగణభూస్థలి డిగ్గె వైనతే
యుని మణిచిత్రవేత్రకరహుంకృతిజిష్ణులుపిక్కటిల్లఁగన్.

క. ఆదరమున శతమన్యుఁడు
నైదండ యొసంగ యామకరిదానఝరీ
మేదురకటప్యాత్రితయము
నాదనుజవిరోధి గడచి యటఁ జని యెదుటన్. 23

శ్రీకృష్ణుఁ డదితిని జూచుట.

సీ. తొడలపై జాఁచిన యడుగుఁగెందమ్ముల
నొయ్యనఁ బౌలోమి యొత్తుచుండఁ
బార్శ్వభాగంబునఁ బంకేరుహాసను
కామినీరత్నంబు కతలు సెప్పఁ
బనిఁ బూని యంతంత వినయావనతవృత్తి
సప్తర్షికాంతలు సంచరింప
వీజనచామరవీటీకరండాది
కములు దిక్పతిసతీగణము దాల్ప
తే. విమలచింతామణీమయవేదిమీఁదఁ
గల్పకలతాంతకల్పితతల్పసీమ
నధివసించినయఖిలలోకైకవంద్య
నమరమాతృకశక్తి నయ్యదితిఁ గనియె. 24
వ. కని సత్కారమణీయుతంబుగ నమస్కారంబు గావించి భా
మినికాటూహృతకుండలద్వయము నాత్మస్వచ్ఛచేలాగ్రబం
ధనమున్విడిచ్చి యొసంగ నందుకొని మోదంబందియానందనఁ
దను దీవించుచుఁ జెంగట న్నిలిపెఁ జంకారత్నపీఠంబునన్

అదితి శౌరియుతతారముల వర్ణించుట.

క. మే నిమిరి శిరసు మూర్కొని
దానవపరిపంథి! యెంత ధన్యనొ నియత
ధ్యానపరు లయినమునులుం
గానని నినుఁ గంటి మంటి గతకల్మషనై. 26
ఉ. సర్గమొనర్తు బ్రహ్మ యన సత్కృపఁ బెంతు జనార్దనుండ నా
భర్గుఁ డనంగఁ బ్రమ్మఱఁగఁ బారణ సేయుదు విజ్ఞగంబు నై
సర్గికలీల నొక్కమఱి సౌఖ్యము నొందుదు కేవలంబు దో

రర్గళభూషణీకృతరథాంగ! నినుం గొనియాడ నేర్తునే. 27

ఉ. వాలముతోఁ గొనన్ గిరులు వజ్రనిపాతము సంస్మరింపఁ బెక్
వాలుగవై మహార్ణవమునం దోలుఁబల్కులదొంగరక్కసున్
వాలికవంకవాఁడిగతిఁ ద్రచ్చి వెస న్నిగమాలిఁ దమ్మిపూ
చూలికిఁ దెచ్చి యీవె త్రిదశుల్ గొనియాడ మురాసురాంతకా!

చ. సురనికరంబు రక్కసులుఁ జుట్టములై యమృతాభిలాషమం
దరగిరిఁ జిల్వరాచతరిత్రాట బిగించి పయఃపయోధి ని
ర్భరగతిఁ ద్రచ్చుచో నడుగువట్టినతద్గిరి యెత్తవే ధురీ
పరివృఢమూర్తివై కమఠపద్మముఖీత్వవిమోహితాసురా! 29

క. విలయోల్బణజలనిధిక
ల్లోలమున నిల మునుఁగ నేకలమవై దంష్ట్రాం
చలమునఁ దాల్పవె నీ వా
బలిసద్మము దూఱ భుజగపర్యంకశయా! 30

చ. *పికిలి యజాండకర్పరము బీటలు వాఱఁగ మేను వెంచియా
మకరనికేతనోదరనిమగ్నమహీమహిళాలలామ కే
తకముకుళాగ్రసంగతమదభ్రమరీసమరీతి గాఁగఁ గొ
మ్ముకొనఁ దగిల్చి యెత్తఁ గిటిమూర్తిని దాల్చితిగా జనార్దనా!

చ. †సటలిట మానరోరి! హరిసర్వమయుండట యెంచుఁబట్టితోఁ
‡జిటచిట లాడి యిందుఁ గనఁ జేయుము నీవని దైత్యుఁడాడినం
బటపట గ్రాతికంబ మిరువాయలుగా నరసింహమూర్తివై
కుటిలనఖాగ్రకుంచికల గ్రువ్వవె వానియురఃకవాటమున్.

మ. నను నాకశ్యపకామినీమణులలోన న్ధన్యఁగాఁ జేయ ను
త్తనయవ్యాజము దాల్చి వామనునిచందాన న్బలి న్మట్టవే
ఘనమార్గోన్నమితాంఘ్రిపద్మమునకుంగంజాప్తుఁడంశువ్రజం

* పెకలి. †సట లివి. ‡చిటపాట.

బనుకింజల్కపరంపర ల్మెఱయ నుద్యత్కర్ణికం బోలఁగన్. 33
మ. ఘనదోర్దండనటత్కుఠారమున వీఁక న్రాజహంసాలిఁ దు
త్తునియ ల్సేసియుఁ గ్రౌంచరంధ్రమునఁ దోడ్తో రాజహంసాలి మే
దినికిం దెచ్చితి కార్తవీర్యభుజపంక్తిం జక్క గావించి తం
బునిధిం గ్రొత్తగ నాశ్రమంబునకు నిమ్ముంగొంటి వీవమ్మునన్.
మ. అరవిందాననఁ గోలుపోయిన యవజ్ఞావాప్తిచే వీరవా
నరసైన్యప్రకరంబు నేలి జలధి న్బంధించి లంకాపురీ
శ్వరకంఠాటవి నేర్చి రౌప్యగిరిలజ్జాపంకముం గీర్తిని
ర్ఝరపూరంబులచేఁ దొలంచితిగదా రామాభిధానంబునన్.
చ. అలుకఁ బ్రలంబదానవుని ప్రాణము గొంటి కళిందనందనీ
సలిలభరప్రవాహరభసంబు మరల్చితి పట్టిఁ బ్రోవ నాఁ
గలిమొన హస్తినాపురి పెకల్చితి కౌరవవీరు లెల్ల బె
గ్గిల నల రేవతీరమణికిం బతి వై యదువంశమౌక్తికా! 36
మ. త్రిపురస్త్రీలఁ బతివ్రతామణుల సారెం బుంశ్చలీవర్తనం
బుపదేశం బొనరించి ఛేల్పఱిచి వధ్యుల్గా నితద్భర్తలన్
ద్విపచర్మాంబరుచూపుటంగలమున న్వే త్రోచి పాటింపవే
కపటశ్రీజనరూపము న్భువనరక్షాజాగరూకేక్షణా! 37
చం. యదుతిలక! జగత్త్రయీనిర్మితిప్రక్రియాకర్మఠేందిందిరోద్భాసి
నాభీసరఃపద్మ! పద్మాసతీపాదపీఠాకృతిప్రస్ఫురత్కౌస్తుభాంకూ
రితాళీకబాలాతపద్యోత! పద్ద్యోతరంగిణ్యుదక్షాళితైణాంక
భృత్పాంసులక్లిష్ట వేల్లజ్జటాజాలజాలంధరోడ్యాణ మూలా
ఖ్యబంధత్రయీ*బంధసంధుక్షితస్పర్శనస్పర్శనిర్గ్రంథితగ్రంథి
షట్కాంతరోన్నిద్రకద్రూసుతశ్రీముఖజ్వాలవల్లీ పరిస్రంస
మానేందు నిష్యంద సర్వాంగనిష్పంద యోగీంద్ర హృద్వే

*బంధుసం.

ఛికావాస! యీవాసవాదుల్సరోజాసనుఁ మున్ను గాఁజేసి
'సర్వంసహాభీరుభారంబుఁ బోఁద్రోయవే' యంచుఁ బ్రార్థిం
చిన న్దేవకీదేవిగర్భంబునం దుద్భవంబంది బాహాద్వయ
ద్వంద్వమున్నంద కస్యంద నాంగాబ్జకౌమోదకీశార్ఙ్గముఖ్యా
యుధవ్రాతముం బీతకౌశేయము న్వత్సభాగంబున న్మించు శ్రీ
వత్సముం జూపినం దల్లి భీతిల్లుచుం 'గావు కావంగదే' యన్న
నీవంతలోఁ గావు కావంచు నేడ్పుల్దలిర్పంగ సుంగంద వైతం
డ్రియత్నంబున న్నందగోష్ఠంబునం దున్న చోఁ బ్రేతయై చేఁతి
పాల్గోలిపనే తెంచు నా పూతనాభూతనారీకుచం బగ్రహస్తం
బునం బట్టి తత్ప్రాణనిర్యాణశంఖంబు పూరించుచందంబునం
గ్రుక్కులన్నొక్కి మిక్కుంచియు* న్బండి రాకాసిఁ గీలూడఁగాఁ
దన్నియు న్వెన్న వేమాఱు గొల్లాడఁగా గొల్లయిల్లాండ్రునందా
రవిందాస్యతో అట్టుగానించిన న్నిక్కపుం బట్టి వేయంచు నిన్బ
ట్టి చట్రోలితోఁ గట్టిన న్దిట్టవై కిట్టి పెన్మద్ది మద్దుల్వడం ద్రో
చియు న్నైశ్శవంబు న్విడంబింపవే, లేఁగలు న్గోపబృందంబు
బృందావనారణ్యవాటిన్నటింపం జలత్కాకపక్షంబుతో బర్హి
బర్హావతంసంబుతో మంజుగుంజాఫలోద్దామదామంబుతోఁ
దానమానక్రియాశంసివంశంబుతో నేపుదీపించు † నీప్రోపు
ప్రేపాపలం గ్రేపుల న్వైపరీత్యంబుగాఁ బాపి యాపద్మజుం
డొక్కచోఁ డాఁచిన న్వానిరూపంబులై పునస్సృష్టి నాస్రష్ట
గర్వంబు ఖర్వంబుగాఁ జేయవే, తోయవేగోచ్ఛలద్వీచికా
మర్దళధ్వాన మాగుబ్బుగా నుబ్బునం గేళిఁగాళిందిలోఁ గాళి
యాహిస్ఫటారంగమధ్యంబునం దాండవంబాడవే, తోడిగో

* బండిపెన్రక్కసుం గండడంగించియుఁ. † నీకాపుప్రేపా.

పాలకశ్రేణికి న్నీకు జన్నంబుల న్మీఁదుగా నున్న యన్నంబుల
న్వాంచితాత్మేశులై పంచలం జల్దు లందీ మునిస్త్రీలను న్నీలఁ
గైవల్యముం గొల్ల యీవే, పెనుంజిల్వయై బల్విడిం జంగిలి
న్మ్రింగు దైతేయు వాత న్వడిం జొచ్చి మైవెంచి తత్కాయము
న్రెండు వాయల్వడం జించి గోపంక్తిఁ బోషింపవే, గుంపులై
యింపులం గూడి యాభీరు లాదేవతానేతను న్జాతర ల్సేయ
వారించి తత్పూజన ల్నీవు గైకొన్న మేకొన్న పేరల్కతోఁ
బుష్కలావర్తకాబ్దంబులం బంపఁగా నంపజాలంబుగాఁ గొండ
లుర్లంగ వర్షించినం గాంచి భీకత్వముం బొందు నామందలం
బ్రోవ గోవర్ధనం బెత్తవే, మత్తవేదండముద్వృత్తి నెత్తమ్మిపూ
వెత్తురీతి న్నిలింపానిశారిష్టదారిష్టమూనాబలీవర్దముం బట్టి
మర్దించి తంచున్వడి న్మ్యాకలాశ్వాకృతిం డాసినం గేశిజీవాని
లంబుల్భుజాదండపాకంబునం గ్రోలి నీ యాహవోద్యద్భుజా
గర్వముం జూపవే — శరదభినవసాంద్రచంద్రప్రభాధౌతభా
స్వత్కళిందాత్మజాసైకతోత్సంగపీఠిం *త్రిభంగ్యాకృతి న్ని
ల్పి యాకుంచితభ్రూవిలాసంబుతో మోము వామాంసముం
జేరఁగా శోణదంతచ్ఛదాంతంబున న్వేణునాళంబు సంధించి
రంధ్రాంతరన్యస్తహస్తాంగుళీపల్లవాగ్రంబు లల్లాడ మ్రోయిం
చిన న్ముక్తరోమంథనిష్పందగోబృందము న్వ్యక్తగోవర్ధన
గ్రావనిష్యందము న్మందమందాంశుమున్నందనా వేగముం గంద
ళన్నీరసారణ్యజీర్ణాగముం గాఁ గడంబించు తత్పంచమారావ
మున్వించు నయ్యంచువిల్కానికిం జిక్కి రాధాదిగోపావరో
ధాంగన ల్డాసిన న్రాసక్రీడ మాయాసముల్లాసివై సౌఖ్య
వారాశి నోలార్పవే, దర్పితాశేషదోషాచరాధీశదుస్సాధమై

* త్రిభంగిగతిఁ.

యున్ననీవిక్రమక్రీడ వీక్షింప నక్రూరుచే మామ పిల్పించినం బోవుచోఁ ద్రోవ భావాతిగం బైననీదివ్యరూపంబుఁ జూపం బరిభ్రాంతుఁడై యున్న మన్నింపవే వాని నీవానిఁగా, భోజభూజాని యుద్వేజనం బందఁ దద్రాజధానిం బ్రవేశించి యేతెంచుచో ముందటం జందనాలేపము ల్దర్శనం బిచ్చిన న్గుజ్జుప్రోయాలికి న్ఋజ్జకం బైనయందంబు నొందింపవే, యాగపూజార్చితం బైనకోదండము న్ఖండఖండంబుగాఁ జేయుచుం దద్ధనుర్దండరక్షాభటస్తోమము స్తంబులం బెల్లుగా డొల్లఁగా వ్రేయుచు న్మల్లగర్జాభుజాస్ఫాలనాభీలమై యుల్లసడ్డిండిమారావవాచాలమై నిగ్రహాయాతరక్షోభటోదగ్రమై యున్న యయ్యుగ్రసేనాత్మజాస్థానిఁ జొత్తేరఁ దత్తోరణక్షోణినాధోరణుం డుద్ధతిం బైపయిం గొల్పినం బట్టపేనుంగుఁ జెండాడి గండస్రవద్దానపంకంబునం బుండ్రముం గుంభనిర్ముక్తముక్తావళిం గర్ణదామంబునున్ గట్టి రక్తంబునం బట్టు మైపూఁతయుం బ్రీతిగాఁ బూసి తద్దంతకాండంబు కేల న్గదాదండమై యుండఁగా జెట్టివై గిట్టి చాణూరుజానూరువు న్మాలుమాలు ల్వడిం ద్రిప్పి నీ వప్పళింప న్భయభ్రాంతుఁడై పాఱ నుంకించు నక్కించుఁ గంసుం ద్రిలోకీనృశంసు న్నియుద్ధక్రియాపద్ధతిం గిక్కిస న్గొంతుక్రొ ల్లొక్కిక్కి మక్కించి నల్దిక్కులన్ దేవతాదుందుభివ్రాతధింధింధిమిధ్వానగానస్వనోత్కర్షహర్షంబులం బెల్లుగా నెల్లలోకంబు లుల్లాసముం బొందఁగా వాని రాజ్యంబునం బూజ్యుఁగా నుగ్రసేనుం బ్రతిష్ఠాపితుం జేయవే, దుష్టసప్తాదశాక్షౌహిణీవాహినీదుర్మదాంధు జ్జరాసంధు భీమాపదేశంబునం జేసి శాసించి కౌంతేయుచే రాజసూయంబు సేయించుచో జాత్యసూయ న్భయం బేది చేదిక్షమావల్లభుం డెంతయున్ ద్రుళ్లినం బ్రల్లదం బాడినం బల్లేరం బెత్తి చిత్రంబుగాఁ దచ్ఛి

రఃక ర్తనప్రౌఢి వ ర్తించి ధాత్రిన్వృథాంవాసుదేవప్రథాచండ శౌండీర్యనప్పాండ్రుఁ జక్రాహతిం జిక్కఁగాఁజేసి యాశానుఁ బోరన్మహాసేన నాగాననవ్యూహసన్నాహము ల్వీడ వెన్నాడి బాణాసురస్ఫారబాహాసహస్రచ్ఛిదాకేళిమై వాలిలోకంబుఁ బాలింపవే,ఘోరభౌమాసురగ్రామణీశిక్షకా! కౌరవాకర్షిత ద్రౌపదీమానసంరక్షకా! ఖేదసందగ్ధసాందీపసూనుప్రదా! వేద శాఖాశిఖాంచత్పవిత్రపదా! మాధవా! సత్యభామాధవా!

కృష్ణుఁడు వైజయంతమున విడియుట.

చ. అని కొనియాడి విశ్వభువనైకధురంధర! నేఁడు రేపు నీ
వనితయు నీవు నిచ్చట నవశ్యము మజ్జనభోజనాదిపూ
జనములు గైకొనన్వలయు సమ్మతిమై నని పల్క దేవతా
జననికి మ్రొక్కి యియ్యకొని జంభవిరోధి మొగంబుఁ జూచినన్.

చ. అమరవిభుండు నేరి వినయానతుఁడై విడిపట్టు వైజయం
తమునను జిత్తగింపు మన నవ్వుచుఁ దద్బలదైత్యవైరిహ
స్తము గయిదండ గొంచు గిరిశప్రముఖాఖిలలోకపాలకుల్
క్రమమునఁ జేరికొల్వఁ జని కాంచె దదున్నతసౌధరాజమున్.

వైజయంతవర్ణనము.

వ. అదియును నామరసరిదుపహృతహేమతామరసస్తోమతోరణ దామరామణీయకసూచిత సౌదామనీవిలసితంబును గనత్కనకకింకిణీకులసంకులక్వాణముగ్ధ మధురాలాపనృత్యన్నిజాప త్యమూర్త్యావహ పార్శ్వప్రవర్తమాన విమాన సంతానంబును, నర్థిజనాభిమతదానార్థసంగ్రహాసంశయాపాది సమస్త వస్తుప్రతిబింబసంభావిత శేఖరీకృతచింతారత్నంబును, నక్షీణ సహస్రాక్ష మణిగవాక్షావళీ సాక్షాత్కృతనాకలక్ష్మీకటాక్ష

పీఠావిశేషంబును, ననర్ఘ్యమణిస్తంభప్రతిబింబితనృత్యదప్సర
స్సహస్రప్రదర్శ్యమానలాస్యవలోకనసారస్యాగతగృహదే
వతాశతసన్నిధానంబును, పులోమనముచిజంభపాకవృత్ర
బలప్రముఖదైత్యవిధ్వంసనసన్నద్ధశతమన్యుజనసన్నాహాను
కారిచిత్రకర్మవిచిత్రితభిత్తిభాగంబును, వళితరుచిరరుచినిరం
తరస్ఫాటికకూటాంతరవిశ్రాంతైరావతోచ్చైశ్శ్రవస్స్నాప్య
మానక్షీరసాగరస్నానక్రమంబును, దరంగితమణి*భృంగారక
వీటికాకరండతాలవృంతచామరదర్పణకళాచికాపాదుకాది
పరికరప్రపంచసంచితకరాంచల†విశ్వకర్మనిర్మితయంత్రపాంచా
లికాసంచయవంచితపరమార్థపరిచారికాసార్థంబును, నిరంతర
సంతానానోకహదుకూలమయపతాకాశతాకారితాకాశ
గంగాచటులతరతరంగావతరణంబును, సమంతతస్తంతన్య
మానతోయకర్మాంతికనిర్ముక్తమందార విటపిమకరందగంధస
లిలసేకాతిరేకశీతలమణివేదికాప్రదేశంబును, బహిర్ద్వారవిత
ర్దికా ప్రకోష్ఠప్రతిష్ఠాపితాష్టాపదఖట్వాస్తీర్ణహరిచందనసా
లబాలపల్లవోల్లసితసంధ్యారాగసంధానంబును, నవిరళకల్ప
ప్రసవరజః పటలపటవాస పాంసువాసితకౌశేయవితానపటీ
ప్రకటీకృతచంద్రాతపపరిపాటికంబు నగుచుఁ, జతురతరశచీ
కరవిరచితంబులై మణికుట్టిమతలప్రతిబింబితతారకాకు
టుంబంబుల విడంబించు పారిజాతకుసుమోపహారంబుల
వలన, స్వాహాబాహాంచలావాహితంబులై మహారజతపాత్రం
బులఁ జిత్రంబులుగా వెలుంగునారాత్రికాదీపకళికలవలన,
యమకామినీధూమోద్గీర్ణవితీర్ణంబులై విస్తీర్ణంబుగా నెగ
యు మలయజకాలాగురుధూపధోరణులవలన, యాతుధా

* భృంగారుదుకూలవీటికా. † కాంచనమయయంత్ర.

నావరోధవధూవిధీయమానంబులై నిలసిల్లుగృహప్రవేశసమయసముచిత బలివిధానంబులవలనం, బాశధరమత్తకాశినీసూత్రితంబులై విలోకనపాత్రంబు లగులలితప్రవాళలతావందన మాలికలవలనం, బవమానమానవతీనియుక్తంబులై బాలికాజనంబులకరతలంబులం బరిభ్రమించు కర్పూరతాలవృంతంబులవలన, నరధర్మసధర్మిణీనిర్మితంబు లగునిధానకల్పిత శంఖపద్మమకరాకారరంగవల్లీమతల్లికలవలన,నయనోత్సవంబావహిలం బ్రవేశించి వాసవవహ్నివైవస్వత వాసతేయీచరణ వరుణ వాయు వసువల్లభ వామదేవుల వరుస వీడ్కొల్పి సత్యభామాసహితుం డై యథోచితకృత్యంబులాచరించి యనంతరంబ. 41

శా. ఆరామప్రియసోదరుం డపుడు దివ్యారామ మంభోరుహా
క్షీరమ్యం బడె చూతమే యన ఘృతాచీమేనకామంజుఘో
షా రంభా హరిణీముఖత్రిదివయోషారత్నము ల్గొల్వ రా
నారూఢోత్సవచిత్తుఁడై గగనకుల్యాతీర దేశంబునన్. 42

క. చందన హరిచందన మక
రంద సరిద్బిందుశీకర ప్రమద వనేం
దిందిర పక్షస్పందన
కందళితమరుత్కిశోరకంబులు వొలయన్. 43

సీ. రంభామహోరోజకుంభపరీరంభ
కుసుమితప్రత్యగ్రకురవకంబు
మంజుఘోషావక్త్రకంజాతచకచక
స్తబకితచంపకక్ష్మారుహంబు
హరిణీముఖప్రసూనాసవార్పణకోర
కితలతావేల్లితకేసరంబు

సుర్వశీనవయావకోజ్జ్వలాంఘ్రినివేశ
పుష్పితకంకేళిభూరుహంబు
తే. మేనకామోదనిశ్వాసమృదుసమీర
కుట్మలితసిందువారంబు కుధరధరుఁడు
ప్రేయసియుఁ దాను నల్లన డాయఁ జనియె
దైవతాధీశనందనోద్యానసీమ. 44

మ. మహీభృద్భేదివనాంతసీమమునఁ బద్మాజాని సత్యావధూ
సహితుం డై యనిమేషవారవనితాసందోహము ల్గోల్వఁగా
విహరింపం జనుదెంచినాఁ డనుచు సేవింపంగ వర్షాశర
న్మిహికాశీతవసంతఘర్మఋతువు ల్నిండెం దదుద్యానముళ్.

సీ. కనుపట్టె నొకచోట ఘనఘనాఘనరంగ
విద్యున్నటీనాట్యవిలసనములు
చూపట్టె నొకచాయ వాపికాజలజాత
జాలవాచాలహంసవ్రజంబు
తలచూపె నొకవంక దరదళత్సేవంతి
కాగంధినీహారకణభరములు
పొడచూపె నొకచక్కిఁ బుష్పితఫలినీల
వంగవాసితశైత్యవైభవములు
తే. నెఱసె నొకయెడఁ దామ్రపర్ణీజలార్ద్ర
చందనాచలపవమానకందళములు
మొనసె నొకకడ పాటలీసంఫుల్లమల్లి
పాటలీచంపకోత్పలప్రౌఢిమములు. 46

క. మలయానిలసంగతిఁ జూ
తలతిక లంకూరజాలదౌహృదవతు లై

యలయిక సడలించినసో
మ్ములకై వడిఁ బాండుపత్త్రములు వెస జాఱెన్. 47

క. గురివెందఁ జైత్రుఁ డొందఁగఁ
గర మలుక న్మావి యప్పుడు కఱచిన నునువా
తెరమీఁదఁ గాననగుపలు
వరుస యన న్ననలు పల్లవముపై మొనసెన్. 48

క. తలిరాకుగుత్తిఁ దమిఁ గో
యిల చంచునఁ జించి క్రోలె నీరీతి వియో
గులగుండియ లవియింపుడు
బలువిడి నని మరునియెదుటఁ బచరించె ననన్. 49

చ. మలయసమీరణచ్యుతసమంచితపాండుపలాశలైనపా
దుల నునుసోగతీఁగలు యదుప్రభునిం దలపించె బాలచా
పలహృతతీరవస్త్ర లయి పంకరుహాకరమధ్యసీమలఁ
నిలిచినముగ్ధగోపరమణీరమణీయవిలాసరేఖలఁ. 50

సీ. పరువంబు గాఁగఁ జొప్పడనిమామిడి తేనె
లాన నాసాస నత్తాడునవియుఁ
దమకించి చిగురాకు గమిచి నోరొగరైనఁ
గడఁగి గొజ్జెఁగనీటఁ గడుగునవియు
సంపంగెపొదరింటిచక్కి గోరఁటఁ గాంచి
యుసురంచు *మగిడి నోరూరుచునవియుఁ
గలిగొట్టుపసరు మొగ్గలఁ గొర్కి పాలివోయి
మునుపటి మొల్లల మూఁగునవియు

ఆ. నగుచుఁ దేఁటికదుపు లామనిఁ దలసూపెఁ
జూపుదనుక నెల్ల చోటఁ దోఁట

* మగిడియు నొఱలునవియుఁ.

యందుఁ దామ యగుచు నమ్మరునెలగోలు
ప్రోఁజు లనఁగఁ జూడ్కిపండు వగుచు. 51

క. నందప్రియనందనుఁ డా
నందన మఖిలర్తునందనం బయి నయనా
నంద మొనరింప నమరీ
బృందంబులు గొలువఁ జనుచుఁ బ్రియసతి కనియెన్. 52

చ. సరసిజనేత్ర! చూచితె వసంతుఁడు నీవనవాటికారమా
తరుణియుఁ బాణిపీడనవిధానమయంబునఁ గేలుదోయి నొం
డొరుపయి సమ్మదంబు లిగురొత్తఁగ మాటికిఁ జల్లు నేసఁబ్రా
ల్నెరసె ననంగ ప్రాలెఁ గుహాళీవిగళన్నవకోరకావళుల్. 53

చ. చిలుకలు వాఁడిచంచువులఁ జించినచో లవలీదళంబులకా
ఫలరసరేఖ లంటి కనుపట్టెడుఁ జూడుము చైత్రుఁ డీలతా
లలనలగండదర్పణతలంబులఁ గుంకుమపత్రభంగముల్
చెలువుగ వ్రాసెనో యన నలిప్రకరాద్వయవాదికైశికా! 54

ఉ. పాదపనూతనాంబుధరపఙ్క్తి విముక్తమరందవర్షసం
పాదితశక్రగోపములభావము నందుచు నోయదృష్టసిం
హోదరసన్నివేశ! కడునొప్పెడు దాడిమబీజము ల్మదో
న్మాదితరాజకీరవదనత్రుటితోరుఫలచ్యుతంబులై. 55

క. తలిరాకు మెఱుఁగు వాతెఱ
కలకంఠవిటుండు గమియఁగాఁ జూతలతా
లలన విదిర్చెను గంటివె.
యలికంకణముఖరవిటపహస్తముల సతీ! 56

చ. తనుఁగనుఁబ్రామి యొండొకలతం బతివేఁటొకతేఁటిబోటిపా
త్తున విరిదేనె గ్రోలఁగ నెదుర్పడి సంపఁగెతావివెల్లిలోఁ

గనలునఁగూలఁబోవునలికామినిసాహస మేమిసెప్ప న [లా!
య్యనుఁగుఁబ్రియుండు నెచ్చెలులు నాఁగినమానదరాళకుంత

చ. అనుచుఁ బ్రియాంసపీఠి నిజహస్తతలంబున నూఁది గల్పకా
వనిజదుకూలమార్జనల వంజులపుష్పమరందసేచన
దనదువిహారవైఖరికి నందనదేవత యాయితంబు సే
సినగతి నొప్పుదివ్యవనసీమ ముదంబున సంచరించుచున్. 58

శా. అర్థిస్పష్టత్రిలిమప్రతాప! మహనీయత్యాగ! దైత్యాభియా
త్యర్థోచ్ఛ్వద్యచ్చతురర్ణవాంతసకలజ్యాభోగ! జాగ్రద్యశ
శ్చర్చాసాంద్రదిగంతరాళ! మదనశ్యామాసహాయేంద్రభూ
వర్చస్త్సేనశరీరమోహితజగద్వామా కళామానసా! 59

క. విదళితకాళింగ! మదా, స్పదసింధురకుంభరత్నశర్కరిలారా
దుదయగిరికొండవీటీ, పదవీస్థలమండలీకభాస్కరబిరుదా! 60

పంచచామరము. మరుద్వ్రతాదటస్థశత్రుమండలీగళాంతర
క్షరన్నవాసృగాపగాభిసారికాదృతాంబుధీ!
మరుత్పతిస్వరుక్షతిక్రమత్రుటత్కుభృద్వర
స్ఫురద్ధ్వనిప్రవృద్ధయుద్ధపుంఖితానకార్భటీ! 61

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధసారసార
స్వతాభినంది నందిసింగయామాత్యపుత్త్ర కౌశికగోత్రపవిత్ర
సుజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతం బైనపారిజాతాప
హరణం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



# చతుర్థాశ్వాసము.



వేంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ! చిన్నమదేవీ
జీవితనాయక! కవితా
ప్రావీణ్యఫణీశ! కృష్ణరాయమహీశా! 1

పారిజాతము.

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
వరున కిట్లను నమ్మౌనివల్లభుండు
వనవిహారంబు సలుపుచు వచ్చి వచ్చి
పారిజాతంబు గాంచి సంభ్రమ మెలర్ప. 2

మ. అమరారాతివిభూతి సత్యఁ గని కాంతా! చూచితే పారిజా
తము భూమీరుహచక్రవర్తిఁ ద్రిజగత్సంపూజ్యసౌరభ్యకీ
ర్తి మరుల్లోక మలంకరించునిది గౌరీనాథుజూటస్థలంబు
మృగాంకుండు రమామనోరమునురంబుం గౌస్తుభంబుం
బలెన్. 3

క. తరుణీ! యీతరుశాఖాం
తరలోలదుకూలమారుతము లింద్రాణీ
పరివారవారసతులకె
పరువవు విరికోఁతఁ బొడము బడలిక నడచున్. 4

ఉ. మానిని! దీనిరత్నకుసుమస్తబకమ్ములకాంతిఁ గమ్మఁబూఁ
దేనియలంచుఁగ్రోలఁ జను దెంచినయాఁటిల దేఁటిదాఁటులో

మానినడప్పి మూఁగఁబడి యున్నతచంచలచంచుకోటిచే
నానెడుఁ జూడు మందగరుదంచలఝంకృతు లుల్లసిల్లఁగన్.

క. ఈతరుశాఖల ప్రేలెడు
మేతోడవ్రులకాంతిలోన మెలఁగెడుపక్షి
వ్రాతము నెఱుఁగరు నిర్జర
కాతరలోచనలు పలుకఁగా వినకున్నన్. 6

క. తనపాదుజలములోనం
గనుపట్టెడునీడ నీనగము విలసిల్లున్
మనకన్న మున్న తా మే
దినికిం డిగి యేఁగుచున్నతెఱఁగునఁ దరుణీ! 7

ఉ. వారణరాజయాన! సురవల్లభుఁ డాశచి నంకపీఠముం
జేరిచి సోగవెండ్రుకలఁ జిక్కులు వాపి వియన్నదీనవాం
భోరుహనాళసూత్రములఁ బొందుగ దీనిలతాంతము ల్సరు
ల్గారచియించినిం చుఁగుతుకంబునవీఁగు మెఱుంగుకొప్పెవ్వెదన్.

మ. వినుమింతు ల్దిలకంబుఁ జంపకముఁగ్రోవిన్నిందువారంబుఁబ్రేం
కనమున్మామిడి గోఁగుఁబొన్నఁ బొగడం గంకేళినూహించి క
న్గొనమోమెత్తఁగఁ గౌఁగిలించుకొనమూర్కోఁబాడఁజేనంటబ
ల్కనగంగల్గుమియంగఁదన్ననుచుంగల్పాగమాయావిరుల్.

చ. కనఁదిలకంబుఁ గేసరముఁ గల్గుమియ న్విహిఁబాడఁ జేరింకనం
బు నిమురమావినవ్వసురపొన్నముఖాంబుజమెత్తఁ జంపకం
బునెఱగవుంగిలం గొరవి మూర్కొన వావిలి దన్న వంజుళం
బునుడువగోఁగునై తరుణి!పూచు సురద్రుమ మన్ని పువ్వులన్

ఉ. నావుడు సత్యభామ నిజనాథున కిట్లను నేల తామసం
బీవిబుధాధినాయకమహీరుహముం బెకలించి లోకసం

భావిత *మైననీపలుకుఁ బంతము సెల్ల మదీయగేహకే
లీవనవాటి వేడుక దలిర్పఁగ నిల్పుము జీవితేశ్వరా! 11

మ. అనినం గైటభదైత్యవైరి దరహాసాంకూరము ల్మోవిపై
మొనయం గొండొక నిల్చి యవ్వనమున న్మోదంబుతో నిర్జరీ
జనము ల్గొల్వఁగఁ గ్రీడ సల్పి భవదిష్టం బేను గావింతు నం
గన యం చాతరురత్నగుచ్ఛమిడియెం గర్ణావతంసంబుగన్.

మ. ఈపగిది స్మరారి హృదయేశ్వరి నూఱడఁ బల్కి నిర్జరేం
ద్రోపవనస్థలంబునఁ బయోరుహనేత్రయుఁ దానుఁ జేరి పు
ష్పాపచయప్రమోదభరితాత్మకుఁడై చిదిమెన్నతాంతముల్
గోపవధూకుచస్తబకలోలనిశాతనఖాంకురంబులన్. 13

మ. ఎలదేఁటు ల్దమ వాలుఁగన్గవలపై నిందీవరభ్రాంతిచే
మెలఁగం జేరలఁ గప్పుకో నలవి గామిం †జీఁదఱిం జెంది యి
చ్ఛలఁ గాంక్షించిరి నిర్నిమేషజలజాస్య ల్మానుషత్వంబు న
య్యలిభీతిన్ముకుళీకృతాక్షియగుసత్యాకాంత నీక్షించుచున్.

ఉ. అంబరచారిపంకజదళాక్షులు చంపకపుష్పరేణుజా
లంబులయందు సర్వశుభలక్షణరేఖలఁ బొల్చునట్టిపీ
తాంబరుపాదపంకజము లంటినతావులు ద్రొక్క నోడి పా
ర్శ్వంబుల సంచరింతురు పరస్పరకేళివచఃప్రసంగతిన్. 15

వృషభగతిరగడ.

కొమ్మ! వేగిర మేటికే కొననోర గోరఁటవిరులు గిల్లుము
తమ్మిపువ్వులమీఁద జలములు తారతారక యుండ జల్లుము
మృగవిలోచన! మేను చుఱుకన మేలమేలత నిటులు ప్రేయఁగ
వగవనేటికిఁ జూడుమీ గోరవంకవంకఁ బ్రియుండు డాయఁగ
నలుగ నేటికి ముదుపుమీఁ చెలువార వారణయాన! మొల్లలు

---
* లీలనీపలుకు. † లజ్జలం.

పొలఁతి! సైఁపవు మాకు నీకయి పోలుఁ బోలులివడినకల్లలు
పన్నిదం బిడఁ బ్రేంకణమునఁ బాడి పాడి దొఱంగి తెచ్చితిఁ
బొన్నమొగ్గలఁ గంటసరి పూఁబోఁడి పోఁడిమి గాఁగ గ్రుచ్చితి
వడుగనేటికి దీనివిరులు దురాశ శఫరీవిలోచన!
జడఁ బరాగము నిండె దుడువు రసాలసాలమరందసేచన
చామరో! సురపొన్నలకునీ చాయఁ జాయలఁ బల్కు నేటికి
భామ! కోయకు వేగపడి పూఁబాళఁ బాళము గాదు నేటికి
మగువ!పలుమఱుదిగిచిచూచుటమానుమానులివడియెదండలు
మగిడిచనుఁడిఁక నేల యీయెలమావిమావిహరించుదండలు
పలుకకుముతుచ్ఛములు పలుమఱుబాలబాలకియన్నఁ దిట్టితి
వలసగమనముఁజూపి చెలి!నీ వంచ వంచన సేసి పట్టితి [కము
తావిబుగులుగొనంగఁదొడఁగెఘృతాచితాఁచితెయీయశో
రావె తేనియ కంచుఁ బలికెదు రంభ! రంభలలో*ననేకము
ననలు వేఁడిన మొఱఁగి తప్పుదు నాలి నాలికుచంబు ముట్టకు
మెనయుప్రాణపదంబుగాఁ దలఁ తీపతీప తలంగ మెట్టకు
మంజుఘోష! సువర్ణలత లనుమానమానందనవనంబున
నంజ దిది యెలదేఁటి కననే మఱచె మఱచెదమే మనంబున
నమృతమధురములైనఫలరసమానిమానిని!త్రుళ్లె శుకములు
గుమురులగు లేమావిచిగురులుగోయఁగోయనికూసెఁబికములు
గుమగుమనివాసనల గేదఁగికొమ్మ కొమ్మకు నందె దోఁటికి
రమణి గొజ్జఁగపొదలు గడు దూరమ్మురమ్ము చలమ్ము లేటికి.

మ. అనుచుం గాంతలు వల్లికారచితడోలాందోళనప్రక్రియం
గనకాంభోరుహకర్ణికాహ్వృతిఁ బరాగక్షేపలీలాగతిం

---

* నళీకము.

వనకేళీపరతంత్రవృత్తి నరుగ న్మార్తాండబింబంబు ని
ల్చె నభోమధ్యమునం గఠోరకిరణశ్రేణీదురాలోకమై. 17

చ. వదలిననీవిబంధముల వాడినమోముల జాఱుకొప్పులం
జెదరినపత్త్రభంగములఁ జిక్కులుగొన్న మణీసరంబులం
బొదలినయూర్పుఁ దెమ్మరలఁ బుప్పొడిఁ గెంపగువాలుఁగన్నులం
ద్రిదశమృగాయతాక్షులు రతిశ్రమఖిన్నలఁ బోలిరందఱున్.

క. బెడిద మగునెండసోఁకునఁ
*దొడిమలు వసివాడి ననలు దొరఁగె లతల నె
ల్లెడ వనదేవతమేనం
బొడమిన లేఁగమ్మఁ జెమటబొట్టు లనంగన్. 19

శా. తూఁగెం జల్లనిగాడ్పు లేమి ఫణిసందోహంబు పేరాఁకటన్
లోఁగెం దప్తసరోజశీధురసమున్ గ్రోల న్మదాళిచ్ఛటల్
ప్రాఁగెన్నీరుగఁ గాంచనాచలతటీగండోపలవ్రాతముల్
డాఁగె న్స్వల్పజలపంకసీమ బకజాలత్రస్తపాఠీనముల్. 20

చ. కనుఁగవ మ్రాన్పడంగ నెఱకల్విరియంబడ బోర మోవ నెం
డినవదనంబులం దెఱచి నిక్కినయక్షులు దల్లడించుటల్
గనఁబడ నూరువుల్ దళముగా నిగుడన్వడఁగుంది యీరెలుం
గునఁదమవానిఁబిల్చుచు శకుంతములయ్యెడనిల్చెన్ప్రాఁకులన్

చ. ఒకయెడఁ జక్రవాకము పయోరుహమిత్త్రుని వేఁడియెండఁ జేఁ
దెకతెకఁ బ్రాఁగుతమ్మివిరి తేనియ తెక్కలఁ జల్ల నార్చి కాం
తకుఁ దనివార నిచ్చెఁ బరితాపము వాయ మృణాళవల్లరీ
శకలము మాటికిం గమిచి చంచుపుటంబున నంది యిచ్చుచున్.

తే. ఆతపగ్లానిఁ బడలినయభ్రమువును
నిజకరాగ్రజలంబుల నెఱయఁ జల్లి

* దొడుకులు.

శ్రవణయుగతాలవృంతసంజాతశీత
వాతములఁ దేర్చె గీర్వాణవారణంబు. 23

క. అపుడు జగత్పతి సత్యా
చపలాక్షియుఁ దాను వెడలె జలకేలికి ని
య్యుపవనతరుకుసుమలతా
తపత్రములు పూని వేల్పుఁదరుణులు గొల్వన్. 24

చ. చనుఁగవ ప్రేఁకము న్ఘనచక్రభరంబును మోవ లేక యొ
య్యనఁ బదపంకజంబు లలసాలస వైఖరి మోపుచున్ జనా
ర్దనుభుజ మూఁతగాఁగ వనితామణి యేఁగెఁ బరస్పరాంగమే
ళనమున రోమహర్షముకుళవ్రజ మొండొరు మేన నిండఁగన్

చ. ఇనకరతాపవేదన సహింపఁగ లేక నిజోదకంబులన్
మునిఁగి వినీలకుంతలసమూహము నాఁగ విచ్చెనాఁగ వీ
చినికరచాలనం దరులఁ జేరినజొంపపు నాచుఁదీఁగలం
దనరునభోనదిం గనియె దానవలోకవిరోధి యత్తఱిన్. 26

తే. కాంచి చేరంగఁ జని మధుకైటభారి
రత్నసోపానకలితమార్గముల డిగ్గి
కులసతియుఁ దాను వేలుపుఁగొలను దఱిసె
నొండొరులకేలుఁదమ్ముల నూఁత గొనుచు. 27

చ. తొడవులు పుచ్చి నిర్జరవధూటులు వేలుపుమ్రాని *చీనిపా
వడలు ధరించి దేహరుచివైభవము ల్నవమల్లికారుచిం
దొడర నితంబచక్రములతో నెఱివాలు మెఱుంగుఁగప్పుఁ బె
న్జడ లొరయంగఁ దద్గగనశైవలినిం దగఁ జొచ్చి రందఱున్.

మ. మరుదంభోరుహనేత్ర లంబరధునీమధ్యంబున న్నిల్వ ని
ష్ఠురతత్పీనపయోధరాహతి జలస్తోమంబు నల్వంకలం

* జీని.

దెరలన్నాభిచయంబులోఁ గొనియె దానిం జాలగాంభీర్యశీ
లురుసంక్షోభమునొందు వారినెచటన్ లోఁగొంచు వర్తింపరే.

చ. ఘనకుచకుంభము ల్బయలుగా విబుధాలయవారభామినీ
జనకరిణీసమూహములు సల్లై యదూద్వహకుంజరంబుపై
వనజవనీపరాగపరివాసిత మైననభస్తరంగిణీ
ఘనతరభంగతోయకణికాచయము ల్గరపుష్కరంబులన్. 30

క. వారణయానలు గరముల
నీ రడిచినరవము మురజ నిస్వనముగఁ జే
న్నారఁగఁ బద్మినులాడెను
వారిజహస్తముల మధుపవలయము లులియన్. 31

క. ప్రౌఢతనంబులు మీఱఁగఁ
జేడియ లడుగులును మొగముఁ జేతులు మెఱయ
న్వేడుక నీఁదఁగ నపు డా
మ్రేడితజలజాత మయ్యె మిన్నే ఱెల్లన్. 32

తే. తామరల ప్రేటులాడుచోఁ దరుణు లెత్తు
కరరుహాంకితబాహువల్లరులు వొలిచె
బిరుదవర్ణావళీపరిస్ఫురిత మైన
పల్లవాస్త్రజయస్తంభపటలి యనఁగ. 33

చ. దానవవైరి దివ్యవనితానికురుంబముతోడ జహ్నుక
న్యానవపంకజాతనివహంబులఁ గందుకకేలి సల్పుచు
న్మేనఁ దదబ్జపత్త్రములు నిండఁగ నంటిన నొప్పు నెంతయుం
దానునుపేంద్రుడౌటనయనంబులు పెక్కులుదాల్చెనో యనన్.

తే. తనమనోవల్లభునిభుజాస్తంభ మూఁది
సలిలవిహారణ మొనరించె సత్యభామ

యలసవైఖరి వీచిదోలాంతరావి
హారసంగతనవరాజహంసి యనఁగ. 35

క. అవతంసితశైవల యై
వివలద్వేణి యయి కోకవిస్ఫుటకుచ యై
దివిషన్నది నాకపురీ
ధవలాక్షులలోన *నన్యతమ యనఁ బొల్చెన్. 36

చ. పెరిఁగినహారరత్నముల పెల్లున నొక్కెడఁ దామ్రపర్ణి యై
నెరసినసోగపెన్నెఱులనిగ్గున నొక్కెడ భానుకన్య యై
గురుకుచలిప్త మైననవకుంకుమ నొక్కెడ శోణ యై నభ
శ్చరనది యొప్పె దివ్యజలజాతముఖు ల్జలకేళి సల్పఁగన్. 37

చ. అలకలు నాసికామణియు నన్నువకౌనుఁగుచద్వయంబుఁగుం
డలములుఁ జంచలింప జతనంబున హస్తము లూఁది చీకుబం
డల దిగజారి రొండొరుకడం దరలాక్షులు దోనివింట బిం
జలు గొన నేయుపుష్పశరుసంపెఁగవాలికతూపులో యనన్.

మ. బలివిధ్వంసియుఁ బెక్కుభంగులమరుత్పద్మాకరాంతంబునన్
సలిలక్రీడ యొనర్చి నిర్భరమదస్తంబేరమప్రక్రియన్
†వెలలెన్సత్యయుఁ దాను మజ్జనవిధావిభ్రాంతకౌటిల్యకుం
తలసంక్రాంతనితంబలై దివిజకాంతారత్నము ల్గొల్వఁగన్.

తే. నెఱులఁ దడి యార్చి క్రొవ్విరు ల్దురిమి మేనఁ
గలపము లలంది తొడవు లంగములఁ బూని
కల్పవృక్షదుకూలాంశుకములు గట్టి
రంగనలు మారునొఱతోడియలుగు లనఁగ. 40

చ. జలరుహపత్త్రనేత్రుఁడును సత్యయుఁ దాను ననర్ఘ్యదివ్యభూ
షలు ధరియించి నిర్జరనిశాకరబింబముఖు ల్భజింపఁ ద

* నన్యతమయుంబోలెన్. † వెలుడెన్.

ద్బలపరిపంథిబాహుపరిపాలిత మైనపురంబు సొచ్చె ని
శ్చలతరనేత్రపౌరజనసంతతి హర్మ్యము లెక్కి చూడఁగన్.

సూర్యాస్తమయావివర్ణనము.

క. దినరాజ త్తటిఁ బంకజ
వనములఁ జరియించుకాంతివర్గము దానున్
వనధి జలకేళి సలుపఁగఁ
జనియె నన న్వారుణీదిశాతటిఁ బొల్చెన్. 42

తే. వేల్పుఁజిగురాకుఁబోఁడులవీఁగుచన్నుఁ
గవలపైఁ గుంకుమచ్ఛాయ గడలుకొలిపి
పసిఁడిగట్టున కొంకవింత *మిసిమి నించి
నెఱసెఁ †గడసావిముదుసలితెఱపయెండ. 43

ఆ. వేల్పుగట్టుగవుల వెలువడి వడదేఱఁ
జదలువాఁకనీట జలక మాడి
వైజయంతహర్మ్యవలభినీడంబులఁ
గ్రందుకొనియెఁ గిన్నరద్వయములు. 44

క. ఘనసాంధ్యరాగవినతా
తనయగరుత్సమితికడఁచితాఁకున ధర వ్రా
లినగగనఫణిఫణామణి
యన రవిమండలము పశ్చిమాంబుధిఁ గ్రుంకెన్. 45

మ. మరుదీశద్విపదానశోభ శిఖిధూమ్యారోచిఁ గీనాశకా
సరదేహప్రభ ‡రాక్షసాసిలతికాంచద్దీధితి న్వారిధీ
శ్వరకేతుద్యుతి మాతరిశ్వహరిణచ్ఛాయన్ ధనాధ్యక్షునీ
లరుచిన్ ధూర్జటికంఠకాంతిదమములొప్పింపెఁ దిగ్భిత్తులన్.

* పసిమి. † గడసారిముదుసలితఱపియెండ. ‡ రాక్షసాలితిలకాం.

మ. వనజశ్రీధనపశ్యతోహరుఁడు జీవంజీవజీవంబు ప
చ్చనివిల్కానికి మామ చల్వగని పర్వత్పాలజూటాగ్రమో
హనరత్నంబు సుధాకరుం డపుడు ప్రాగద్రిస్థలీవీథి నొ
య్యనఁ దోతెంచె వియత్తటీకషణలీలానీతశంఖాకృతిన్. 47

క. ఆరాత్రి సత్యఁ గూడి ము
రారి ముదం బెసఁగ వైజయంతమున మనో
భూరాజ్యసౌఖ్యనిద్రా
పారీణత నుండుచోఁ బ్రభాతం బయ్యెన్. 48

సీ. మొగుడుతమ్ములఁ జిక్కుమగ తేఁటియలుఁగులు
సడలిపోఁ జేయువిశల్యకరణి
కాలవశంబునఁ గడచన్న వాసర
శ్రీఁ గ్రమ్మఱించుసంజీవకరణి
రే యను వాలునఁ బాయ లైనరథాంగ
తతుల హత్తించుసంధానకరణి
తిమిరంబుచే సొంపు సమసినదిశలకు
వన్నియ నొసఁగుసౌవర్ణకరణి

తే. మించుబిరెండయగ్నిఁ బుట్టించుసరణి
కలుషఘోరపయోరాశిఁ గడపుతరణి
తోఁచెఁ బ్రాచీమహీధరోత్తుంగసరణిఁ
బ్రాఁజదువుమానికంబులబరణి తరణి. 49

పారిజాతాపహరణము.

క. హరి యప్పుడు పారిజాతా
హరణోద్యోగమున నందనారామము ని
ర్భరగతిఁ జొచ్చె విహగవర
పరివృఢుపయి నెక్కి సత్యభామయుఁ దానున్. 50

ఉ. సకలసురైకవంద్యుఁ డగుచక్రధరుం డిదె నేఁడు దన్ను ను
ర్వికిఁ గొనిపోవ వచ్చె నని వెక్కస మైనమనఃప్రభూతకౌ
తుకమునఁ బోలె సంభ్రమముతో నటియించె నభీష్టవస్తుదా
యకతరుచక్రవర్తి యపు డాతతవాతవిధూతశాఖమై. 51

కం. శౌరి యిదె పారిజాతముఁ
గోరికఁ గొని చనుచు మనలఁ గొనిపోఁ డని లోఁ
గూరిననెవ్వగఁ దక్కిన
భూరుహములు మధురసాశ్రుపూరము నించెన్. 52

మ. సురలోకాభిమతప్రదానసమతాసూయ న్బలెం గంసఘ
స్మరుఁ డత్యుద్ధతిఁ బారిజాతధరణీజాతంబు గోవర్ధనో
ద్ధరణప్రస్తుత మైనహస్తమున నుత్పాటించి లీలాగతిన్
గరుడస్కంధముమీఁద నిల్పి నిలిపెం గౌతూహలంబింతికిన్.

చ. జలరుహనాభుఁ డిట్లు రభసంబున నందనపారిజాతముం
బలిమిఁ బెకల్చి యెత్తె విటపంబుల వ్రేలుదుకూలపల్లవం
బుల *వడిఁ బట్టి యీడ్చుఁ గొనిపోవఁగనీక పెనంగులీలఁ గ
ల్పలతిక లెల్ల వల్లభలు ప్రాణవిభుం బెడఁబాయ నేర్తురే.

చ. గరుడుని తెక్కలం బొడము గాడ్పులసోఁకునఁ దక్కు వేలుపుం
దరువులుఁ బెల్లగిల్లి గగనంబునఁ దోడన వెంటనంటి రా
నరిగెడుపారిజాత †హరణాచరణవ్యసనైకలోలు నా
హరిఁ గని యడ్డమై పలికి రచ్చటినందనపాలు రందఱున్.55

చ. తగునె యదుప్రవీర! యిటు ధౌర్త్యము నీ వొనరించి యీ మరు
న్నగము హరించి వంచనఁ జనన్ దివిజాగ్రణి దీని నిచ్చె ద
క్కఁగ నిజకాంతకాకుసుమకోమలయాజ్ఞ భయంబునొందుఁ దేఁ
టిగములు దీని చెంగట నటింపను ‡నిందులతావిఁ గ్రోలఁగన్.

*బిగఁబట్టి. †మహీజాహరణవ్యస. ‡బువ్వులతావి.

*క. అట్టిసురతరువు నెఱుఁగక
చుట్టపుమేలమునఁ గొంచుసురిగెడుమది నీ
కెట్టు జనియించె మరలం
బెట్టుము బలభేది విన్న మేలే నీకున్. 57

ఉ. నా విని సత్యభామ వదనంబున లేనగ వంకురింప నే
మే వచియింపఁ బూనువ్యాదయేశ్వరునిం గరసంజ్ఞమాన్పి చ
న్నైవల జాఱుకొంగు సవరించుచు వీడినకొప్పుఁ బల్మఱుం
జేవెడ దోపుచుంబలికెఁ జెందొవచూపులు క్రేళ్లుదాఁటఁగన్.

సీ. వినుఁడు సురేశ్వరువనపాలకులు! వార్ధిఁ
బొడమినయీదివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె యింద్రుండు నెవ్వఁడు
తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నత†డె చేకొనుఁగాక
‡తెక తేర యిది యేమి యొకరిసొమ్మె
యిదె నాదువిభునిచే నీవదాన్యనగంబు
నొడియించుకొని యేఁగుచున్నదానఁ

తే. బలుకు లేటికిఁ దా వీరపత్ని యేని
మీఁ శచీదేవి తనదుప్రాణేశుఁ డైన
మఘువు నిటఁ బంపి సత్యభామావిధేయు
వలన మరలంగఁ గొనుటె పో వాసితనను. 59

క. అని పలికినగరోక్తులు
విని వనపాలకులు చాల విస్మితు లగుచుం

* ఈపద్యము కొన్ని ప్రతులలోఁ గనఁబడదు. † డిచ్చఁగొనుఁగాక.
‡ తెక తెక.

జని చెప్పి రంతయును దా
రనిమిషపతికిం బులోమజాన్వితునకున్. 60

యుద్ధోద్యోగము.

శా. ఆమాట ల్విని పాకశాసనుఁడు రౌద్రాకారుఁడై పేర్చియే
మేమీ కృష్ణుఁడు* మందలోబలెనె తానింద్రద్రుమోత్పాటనం
బీమై నిచ్చటఁ జూపవచ్చె నిది మేలే తార్క్ష్యుఁడైనన్మదీ
యామోఘాశనిపాతమిట్టిదనియాహా తెల్పఁడాయెం జుమీ.

మ. అని పౌలోమి మొగంబుఁ జూచి వినుమో యబ్జాస్య! నీకింత మా
త్రన విన్నంబడ నేల పోదు నిదె సత్యాగర్వభారంబు ది
వ్యనగంబు న్విడిపించి వత్తు నని సాహంకారుఁడై లేచి చ
య్యన శుద్ధాంతగృహంబు వెల్వడి సుధర్మాస్థానమధ్యస్థుఁడై.

ఉ. తా నటు పారిజాతవసుధారుహముం గొనిపోవువాఁడు క
న్గానఁడు యాదవుండనుచుఁ గన్నులు వేయును జేవురింపవై
శ్వానర ధర్మదైత్యవర వారిధి పానిల యక్షనాయ కే
శానుల దిక్కుఁ జూచి కులిశంబు కరంబునఁ బూఁచిపట్టినన్.

ఉ. శోణపరంపరాహతులఁ గూరిన వేదనతో సమస్తని
ర్మాణ భృతి ప్రణాశకరు మాధవునిం జెనకంగఁ బోవు గీ
ర్వాణులఁ బోకుఁడంచు మొఱవైచెనొకో యన మ్రోసె నంతని
స్సాణము పాకశాసనుహజారమునం గదనాభిశంసియై. 64

మ. అపుడాబద్ధఖలీనకాశ్వచయమై యందూపరిభ్రంశిత
ద్విపమై దివ్యరథాగ్రకేతుపటసంధిత్సామిళత్స్నాతమై
యపరాఘాతభుజావలేపభటవీరాలాపమై జంభవై
రిపురం బంతయు మందరక్షుభితవార్ధింబోలె ఘూర్ణిల్లుచున్.

* మందలోనబలె.

ఉ. నీ యనుజన్ముఁడ న్సఖుండ నీ కని యింటికి వచ్చి జంభదై
తేయవిరోధి చే నపుడు తేజము లన్నియుఁ గాంచి చేసె న
న్యాయము పారిజాతహరణంబునఁ గృష్ణుఁడుమంచిచుట్టమా
రా యని పల్కఁగా జనపరంపరచే విని రెల్లవారలుఁ. 66

వ. అత్తఱిం దత్తఱంబునం దత్తడులం బల్లింపక యప్పళం
బున నెక్కంబోవు వారును, గృష్ణుండుకృష్ణుఁడని పౌనఃపున్యం
బుగాఁ బలుకుచు నేమేమి యెక్కడెక్కడ యడుగు వారికిఁ
దెలివిపడ నుత్సవం బడవు లేక పారిజాతంబు పారిజాతం బని
పలుకుచు రణసంభ్రమంబునం బరిభ్రమించు వారును, గణయ
కంపణముసలముద్గరపరిఘుపరశ్వథంబు లనియెడుబహువిధ
ప్రహారణాహారణ విపర్యాసంబున శస్త్రశాలాంతరంబునం
గలహించు వారును, మరుదధిప మలినపథ మహీపరథమాం
సాశన మకరాకరేశ మాతరిశ్వ మనుష్యధర్మ మహేశ్వరు
లకు మావవుం డీ డగునే యను వారును, గత్తు లంకించు
వారును, రిత్త జంకించు వారును, సంగడీలం జీరు వారును,
సంగరభీరులం గేరు వారును, వాహనంబులఁ దఱుమువా
రును, సాహసంబుల నఱుము వారునునై వీరావేశంబున రాజ
ద్వారంబునం దొట్టి రయ్యవసరంబున.

తే. గలితశృంఖల లయ్యు నకాలనిద్ర
గనుగవలఁ గ్రాలఁ దమయంతఁ గదలవయ్యె
దారుణాధోరణప్రయత్నమునఁ గాని
నముచిమథనునివీట శుండాలఘటలు. 68

క. పొరిఁబొరి నెగయుచు మ్రొగ్గుచు
ధరణీస్థలిఁ బొరలఁబడుచుఁ దలకొని శిక్షం

బోరసిన వయ్యు హయంబులు
భరియింపవు కొంతతడవు పల్యాణంబుల్. 69
ఉ. డాసి పురోహరిన్మణివిటంకమునం దనమేనినీడ ను
ల్లాసమదృష్టిఁ జూచి కినుకం బ్రతివీరుఁడ!యంచుఁ బ్రేసి బా
హాసివిభిన్న మై పడఁ దదర్థముఁ జేకొని వచ్చెఁ గల్పవృ
క్షాసవపానమత్తుఁ డమృతాంధసుఁ డొక్కఁడు జన్యకేలికిన్.
తే. కారణము లేక యూరికె నారి దెగిన
విడిచి పెట్టక రణరసావేశ మొదవఁ
బట్టి కోదండదండంబు పరిఘు గాఁగ
విసరుచును వచ్చె వేఱొండు వేల్పుజోదు. 71
క. గొనయంబు *నెక్కఁ ద్రోచిన
గనయంబున కెక్కకున్నఁ గ్రమ్మినతమకం
బున విల్లు విడిచి వేఱొక
యనిమిషభటుఁ డనికి వెడలె నడిదముఁ గొనుచున్. 72
ఉ. పట్టఁదలంచెనేని పదపద్మయుగంబు వశంబు గాక లోఁ
బుట్టినబాష్పగద్గదికఁ బోకు మనం బలు కెత్త లేక పైఁ
జుట్టిన నెయ్యపుంబదనుచూపులచే సతి వెంట నంటి త
న్బట్టక పట్టఁగా నొకసుపర్వుఁడు వచ్చె రణాభిలాషి యై.73
క. సురవీరుఁ డొకఁడు సతిచే
దురమునకు ననుజ్ఞ వేఁడి తొల్లిటియలుకం
జిరకాలదుర్లభం బగు
పరిరంభము గాంచి వెడలెఁ బ్రమదం బెసఁగన్. 74
చ. నను నని సేయఁ బంపు ఖగనాథునిసోగపసిండిఱెక్క లు
క్కునఁ గొని కర్ణపూరమునకు న్బ్రభసంబునఁ దెత్తు నేను నీ

*నెంతఁ... నెక్కకున్న.

కని తన కడ్డమై నిలుచునచ్చరతోయ్యాలి నూఁటడించి ప్రో
రునకరు దెంచె వేల్పుఁగొమరుం*డొకరుండురుదండహస్తుఁడై,

ఉ. మానసవేగరథ్యమును మాతలిసారథికంబు నగ్రసం
దానితనీలనీరదపతాకము నైనరథంబుపై శచీ
జాని పులోమవృత్రబలజంభశర†ప్రవిఘాతకారణం
బైనతనుత్రముం దొడిగె నాహవదోహలమానసంబునన్.

సీ. గతి మ్రుచ్చిలఁగ వేచుగాలిఁ ద్రావఁగఁ బాఁపు
నిడినకైవడిఁ గాలికడియ మమర
నల దేవమణికిఁ గావలి యిష్టప్రహరి నా
గళమున ఘంటికావళులు మొఱయఁ
బన్నగాశికి ‡నెదుర్పడ వెండిఱెక్కలు
ధరియించె ననఁగఁ బక్కెర సెలంగఁ
బారిజాతాహృతిప్రభవరోష మనంగ
గతిరోధజనితఘూత్కృతులు నిగుడ

తే. ఖురముఖక్షుణ్ణకాంచనక్షోణిరజము
పర్వ సంధ్యారుణేందుబింబంబుఁ బోలు
వాహకోత్తముఁ డైనరేవంతుఁ డమర
వల్లభునిమ్రోల నుచ్చైశ్శ్రవంబు నిలిచె. 77

శా. చండస్థూలకరద్వయద్వయమహాస్తంభంబులం బూని యు
ద్దండస్ఫారపతాకికాసహితమై దానచ్ఛటాచిత్రవ
ద్గండాభోగవిశాలకుడ్యములచేఁ§గన్పట్టునద్దేవతా
శుండాలం బరుదెంచె సంగరరమాశుద్ధాంతసౌధం బనన్.

---

* డొకఁడుద్ధురఖడ్గహస్తుఁడై. † ప్రతిఘాతకార. ‡ నెదుర్పడి పైఁడిఱెక్కలు...పక్కెరలు సెలఁగ, నెదుర్పడ వేఁడిఱెక్కలు. § గన్పట్టియద్దే.



ఉ. ఏడుకరంబుల న్వరుస నెత్తినతోమర శక్తి చాప శ
స్త్రీ డమరు స్రువ వ్యజన దివ్యమహాత్తరసాధనంబు లా
మ్రేడితకాంతితో నిజశరీరరుచిం బచరింప వచ్చె న
య్యేడిక రాంచత్తడిపయిన్ హుతవాహుఁ డుదగ్రమూర్తియై.

శా. బాహాసంభృతకాలదండజనితస్ఫారస్ఫులింగాళికి
న్సాహాయ్యంబు ఘటించి కోపరసఘూర్ణన్నేత్రదీప్తుల్పయో
వాహాంతర్గతవైద్యుతప్రభల *లేవం జూప వాహద్విష
ద్వాహోత్తంసము నెక్కి పోరి కడ రెన్వైవస్వతుం డుద్ధతిన్.

శా. భీమాకారులు గామరూపధరు లాభీలక్రియా†పారగో
ద్దాము ల్పుణ్యజను ల్భజింపఁ గుముదస్తంబేరమం బగ్రతో
భూమిం బల్లన గట్టి రా నసిరుచిస్ఫూర్తుల్విజృంభింప సం
గ్రామేచ్ఛం బలలాశి యేఁగె మనుజస్కంధాంతరారూఢుఁడై.

చ. మకర కుళీర కచ్ఛప సమానము లైనముఖంబుల న్భయా
నకరస ముప్పతిల్లఁ గెలన న్నిజకింకర‡దైత్యదానవ
ప్రకరము గొల్వ బాహుశిఖరంబునఁ బాశము పూని వార్ధినా
యకుఁ డని కేఁగు దెంచెఁ గలహంసతురంగరథాధిరూఢుఁడై.

ఉ. అంగసుగంధము ల్నిజభటాలిపథశ్రమముల్ హరింప ను
త్తుంగగడాపరిభ్రమవిధూతము లై ఘనము ల్దిగంతమా
తంగపిశాలకర్ణములఁ దార్కొని చామరలీలఁ జూప సా
రంగహయంబు నెక్కి సమరంబున కేఁగె సమీరుఁ డుద్ధతిన్.

క. నలకూబర మణికంఠులు
బలముల నడిపింప నర్థపతి దురగముపై
ధళధళితచంద్రహాసో
జ్జ్వలితభుజుం డగుచు నడచె వాసవుప్రోలన్. 84

* శేవం జూప. † పాదనోద్దా. ‡ వీరదానవ.

ఉ. ఆననసీమఁ గ్రోధజనితారుణదీధితి ఫాలభాగనే
త్రానలకీలలం బెనుప హస్తమున న్నిశితత్రిశూలముం
బూని మదించి అంకెలిడుపోరిట గిబ్బలతేని నెక్కి యీ
శానుఁడు వచ్చెఁ బారిషదసైన్యముతో రణకౌతుకంబునన్.

ఉ ఆయుధగర్భితంబు లగునంజలు లెత్తి పులోమకన్యకా
నాయక! యేన యేనయనినాకనివాసులు మ్రొక్కి సూరెలం
బాయక కొల్చి రా దిగధిపాలురతో నలనందసూనుఁ డా
హోయిటు సేయు సేయనిమహోహమికంబలుమాఱుపల్కుచున్.

చ. హరిహయుఁ డాహరిం గెలుచునాసయు మోసము నాకయీ
గతిం, బురి వెడలంగ నవ్విభుని మ్రోల పురుద్వసు విశ్వరు
ద్రభా,స్వరతుషితాదిక త్రిదశవర్గములుం బ్రముఖాళి మూఁడుకోటు
లు,ద్ధురగతి నేఁగు దెంచె రణధూర్వహగర్వములుల్లసిల్లఁగన్.

శా. అర్వారోహణచాతురీవిలసనాహంకారదుర్వారత
సర్వాంగీణము లైన మైమఱువులు *నృస్త్రీకృపాణంబులున్
గర్వాలాపవిడంబము లైఱయ జోకం జిత్రసేనాదిగం
ధర్వు ల్వజ్రికిఁ దోడుసూపిరి పురద్వారప్రదేశంబునన్. 89

ఉ. హేమధరాధరంబు చలియింప వెసన్ బహుకోటిసంఖ్య లై
యామరసైన్యము ల్నడచునప్డు †నంతసితోష్ణవారణ
స్తోమనిరోధ మందియును దోడనె దిక్కులఁ గప్పె నయ్యెడం
జామరవాయునున్న ...లుసాంద్రహిరణ్మయభూష...గముల్.

ఉ. దారుణభంగి నొండొకటి దాఁకెడువస్త్రముఖంబుల న్నణా
త్కారము ‡లుల్లసిల్ల బెడిదంబుగఁ బుట్టినసందడిం బుర

---

*జంచత్కృపా. †నత్తురగోష్ణవారణ; నంచరితోష్ణవారణ; నంతత గంధవారణ. ‡లుప్పతిల్ల బెడిదంబుగ దొట్టిన.

ద్వారము నిర్గమించె సురవల్లభుసేనలు భర్గజూటకాం
తారముఖంబున న్వెడలుదైవతసింధువుఝరంబులో యనన్.

శా. బాణద్విణ్మథితాంబుధిధ్వనికళాపాణింధమాసికని
స్సాణస్వానభిదేలిమాద్రితట! నిస్సామాన్యచాపాగమ
ద్రోణాచార్య! సురీసమూహవరణోద్యుక్తాహితశ్రేణిని
శ్రేణీభూతకృపాణ! మాంసలభుజాశేషాహిపత్యుద్ధరా!. 91

శా. వాజ్యారోహణనైపుణీనకుల! దోర్వాతంధయారూఢస
ర్వజ్యాచక్ర! రజస్తమశ్ఛయతమిస్రారూపజన్యాంగణ
ప్రాజ్యోద్గీతయశశ్శశాంక! దళితారాతిక్షమాపాలర
క్తాజ్యోదంచదుదారశౌర్యహుతభుగ్వ్యస్తాఖిలాశాంతరా!

క. చండతర మూరురాయర
గండమహాబిరుద! ఘాటికారయవిచల
త్కొండపలి కొండవీటీ
మండలకటకేశసింధుమంధరకుధరా! 93

తోటకము. త్వరితాధరితానిల వాజి నట
త్ఖుర జోరురజోభర గూఢ రవి
స్ఫురణా కరణాధిక సూత్కృతిమ
ద్విర దాకర దారణ వీరబలా! 94

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధసారసార
స్వతాభినంది నందిసింగయామాత్యపుత్త్ర కౌశికగోత్రపవిత్ర
సుజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతం బైనపారిజాతాప
హరణం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



# పంచమాశ్వాసము.



వర్ణనీయ! తిరుమల
దేవీహృదయేశ! యమృతదీధితికులపా
రావారపారిజాత! ధ
రావలయశరణ్య! కృష్ణరాయవరేణ్యా! 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
వరున కిట్లను నమ్మౌనివల్లభుండు
దైవసైన్యంబు లీరీతిఁ దరతరంబ
వెడలె మొన లేర్పరించి యుద్వేలవృత్తి. 2

యుద్ధము.

ఉ. వచ్చితి మింక నెందుఁ జనవచ్చు నోహో నిలు పారిజాతపా
టచ్చర! యంచు జంకెలు గడల్కొనఁ గృష్ణునిఁజుట్టుముట్టివై
యచ్చరసేన దాఁకునపు డచ్చుల మే మని చెప్ప నిక్కలం
జిచ్చుఱతూపుఁదండములు సింహారవంబులు నిండె నొక్కటన్.

ఉ. ఆకమలాయతాక్షి సమరావనిజాతము డించి సంభ్రమ
న్నాకపురీమహారథుల నవ్వుచుఁ గన్గొని యంగుళిత్రగో
ధాకలనంబుతో యదువతంసుఁడు శార్ఙ్గనిబద్ధశేషని
ర్మోకనిచోళముం దిగిచె రోషనటద్భ్రుకుటీవిలాసుఁడై. 4

క. తిగిచి శరాసన మెక్కిం
చి గుణధ్వని చేసి యంసశిరముల దొనలన్
బిగియించి తూపు లొక్కట
నిగిడింపఁ దొడంగె మరుదనీకినిమీఁదన్. 5

క. భిన్నాసురాస్త్రముల చవి
గన్నమురాహితశిలీముఖము లపు డనిలో
ము న్నెఱుఁగనిసురవీరుల
క్రొన్నెత్తురుచవియు నెఱిఁగి క్రోలఁ దొడంగెన్. 6

చ. అమరహితంబు గోరి యసురాంగముల న్విదళించునట్టిమా
కమఠల *ద్రుంపఁగావలసె నక్కట నేఁ డని సిగ్గుఁ జెందుచం
దమునఁ గఠోరశార్ఙ్గజనితప్రదరంబులు వైరిమర్మభేదములో
నరించి యుద్ధవసుధాస్థలిఁ †గూడఁగఁబాఱు నయ్యెడన్. 7

సీ. హరిబాణలూనంబులై వచ్చునమరాస్త్ర
ఖండము ల్దూల్చుఁ బక్షముల జడిసి
యమృతగంధాసక్త మగుచంచుపుటమున
వడి సింధురంబులఁ బొడిచి యెత్తు
నధిపుఁ జేసినఁ బాఱునాశుగంబులకంటె
మునుమున్న చని లక్ష్యములు దళించు
భటులపై హరులపై బహురథాగ్రములపై
నొక్కఁ డయ్యును దోఁచుఁ బెక్కుగతుల
తే. నఖముఖంబుల నిఱికి గండ్రలుగఁ జేయు
దివిజబిరుదధ్వజంబు ‡లుద్రేకవృత్తి
నిఖిలలోకాద్భుతావహనిర్నిరోధ
విక్రమస్ఫూర్తి ఖగరాజచక్రవర్తి. 8

తే. సర్వతోముఖ మయి పేర్చుశార్ఙ్గిబాణ
వర్షసమ్మర్దదుర్దినవ్యాప్తివలన

* నొంపఁగా. † దూఱఁగఁబాఱు. ‡ లుద్వేలవృత్తి.

నప్పు డెదిరించి పన్నిద్ద ఱహిమకరులుఁ
గానఁ బడలేక తేజోవిహీను లైరి. 9

ఉ. చుక్కలరాణివాసముల సోయగపుంజనుదోయిత్రొక్కనం
జిక్కన దైనయక్కయదుసింహుఁడు బాణపురంపు హాటక
ప్రక్కలు సేయఁగా నుదధి కంబునఁ దోఁగు మరీచిమండలం
బెక్కినచాయ నభ్యుదయ మేదినుఁ డార్చెర గాంగణంబునన్.

తే. చోద్య మప్పుడు భవరోగవైద్యుఁ డైన
యంబుజోదరు డాసినయంతమాత్ర
నపగతాసాధ్యగదుఁ డయ్యె యక్షభర్త
సారిచె రుద్రులు నిర్ముక్తశూలు లైరి. 11

సీ. నిర్భగ్నశృంగుఁడై నిజవాహనముఁ దాను
వైవస్వతుఁడు లాఘవంబు నొందె
దళితశాతకృపాణదంష్ట్రుఁడై నైరృత
భుజభుజంగస్వామి పొల్లువోయె
నిర్ధూతహేతి యై నిలువు నీఱుగ నగ్ని
దేవుండు నిర్వాణతేజుఁ డయ్యె
భయపలాయనవేళఁ బవమానునకు నాత్మ
జవసత్త్వములకల్మి సఫల మయ్యె

తే. వరుణునకు డాఁగికొనఁ జోటు వలఁతి యగుట
నుదధినాయకభావంబు నుపకరించె
జలరుహోదరసవ్యాపసవ్యముక్త
నిష్ఠురాస్త్రంబు లొండొండ నిగుడునపుడు. 12

వ. మఱియు నమ్మధుమథను సముద్దండ దోర్దండ మండలీకృత శార్ఙ్గకోదండ నిర్ముక్త నిర్భర క్రూర నారాచధారా నిపాతం

బున గవాక్షితవక్షు లగుయక్షులును, చక్రనిర్వక్రవిక్రమ క్రీడలం బరిచ్ఛిన్నకర్ణనాసాధరు లగువిద్యాధరులును, కౌమోదకీప్రహారంబులం జూర్ణీకృతశిరోమధ్యు లగుసాధ్యులును, నందకాసిధారావిదారణంబునం బ్రత్యవయవశిథిలితాసువిద్ధు లగుసిద్ధులును, పతంగపుంగవపక్షవిక్షేపణాహతిం దూలి జర్జరు లగునిర్జరులును, ధైర్యంబులతోడన కంకటంబులు ప్రస్విన్నం జాలుకఁదనంబు నొంది సాధ్వసోద్రేకంబున భద్రదంతావళంబుల డిగ్గ నుఱికి మేరుశిఖరంబులు వ్రాఁకియు రథ్యసారథిసహితంబుగా శతాంగంబులు పొడిపొడియైనం జొరమఱు వెలుంగక మాతంగశవంబుల క్రిందనీఁగియు భగ్నచరణంబులై తలకెడవుగం ద్రెళ్లినతురంగకళేబరంబులం గౌఁగిలించుకొని నిర్జీవులుసుంబోలె గ్రుక్కుమిక్కనక పక్కెరలు పైఁ ద్రోచుకొనియును సంత్యక్తహేతివర్గంబును సర్వతః ప్రధావనమార్గంబును బ్రవర్తితప్రార్థనాలాపంబును బరిఘూర్ణాయమానకేశకలాపంబునుం గాఁ గాందిశీకత్వంబు నొంది తిరుగుడు వడి పాంచజన్యఘోషంబు మున్నుగా దిగంతంబులంటం బఱచుటయుఁ, బ్రహారమూర్ఛాపరవశు లగుజయంతనలకూబరచిత్రసేనాదులం గనకకమల దళపుటానీయమానంబు లగునభ్రగంగాపానీయంబుల సేదదేర్చి ఫలకగర్భంబులకుం దార్చి నిజనివాసంబులకుం జేర్చికొనునాప్తసేవకవర్గంబులవలనను, విలూనదండంబులై పడిన ధవళచ్ఛత్త్రంబులఁ బ్రఫుల్లపుండరీకంబు లని పరిభ్రాంతి నొడియనట్టాడుచు నిపాతితవరుణాం బై నింగిఁ జేరెంబు వాఱు వాహనహంసంబువలనను, మేదురమేదపంక సంకులంబు లగురుధిరపల్వలంబులు దఱిసి మజ్జనక్రీడాపరాయణాం బై

చండిఁ పడి కదలమిం గృతాంతుండు విడిచి పోయిన జిఱ్ఱకొట్టుచుఁ దిరుగుచున్న త్తలులాయంబులవలనను, మూర్ఛితక్షపాకర మండలనిర్గతం బై నిగ్గళితశృంగం బగులాంఛనమృగంబుం గురంగీశంకం దఱిమికొని వెనువెంటం దిరుగుచలాయితపవమానవిముక్తకురంగంబువలనను, వైనతేయచరణానఖముఖాఘాతనిపాతితంబు లై రణధూళిధూసరితంబు లగురుద్రజటామండలశశిఖండఖండంబులఁ గర్త్తపూరంబులుగా నిడుకొను వేడుకం గూడ నొండొరులఁ గడవం *గొరికొను బేతాళబాలికాజనంబులవలనను, గదనరంగం బభిరామం బయ్యెనయ్యవసరంబున. 13

చ. హరిహయుఁడాగ్రహోజ్జ్వలితుఁడై యనిఁ బాఱుదిశాధినాథులకా, దిరుగుఁడుపోకుపోకుఁడనిత్రిప్పి యదల్చి నహోదయత్నమో, ధరమునలంకరించు తనధన్వ మహిజ్యము చేసి గోత్రభీకరముగ బాహు లెత్తి తమకంబున సేనకుఁ జేయినీచినకా. 14

క. గిరితటముఁ దాఁకి తిరిగెడు
తరంగిణియుఁబోలె దేవతాపతియాజ్ఞకా
మరలి వియచ్చరవాహిని
మురహరునిం బొదివి ఘోరముగఁ బోరునెడకా. 15

ఉ. †ఱింగను మ్రోఁత మ్రోఁగుచును ఱెక్కలపాములువోలె శౌరిచే, సింగిణివింట వెల్లిగొనుచిత్రశరంబులు సూతు నొంచి రథ్యాంగకము ల్దళించుచు నిజావయవంబులు దూల్చ దేవతాపుంగవుఁ డోసరించుటయు బోరననష్టముసొచ్చెసైన్యముల్.

మ. మది నొక్కించుక శంక లేక సమరోన్మాదంబునం బేర్చి బెట్టిద మై తాఁకినదేవతారథికకోటిం గిట్టి తూలించె ను

*జేరుకొను. † ఱింగున మోము మ్రోయుచును.

స్మదవేదండఘటాతమశ్ఛయనిశంమన్యంబుఁ దత్తై న్యమున్
గదచే శార్ఙ్గముచే రథాంగకముచేఁ గంసారిహింసారతిన్. 17

ఉ. సైనికు*లెల్ల నంత రణసన్నహనం బెడలించి పాఱిన
న్నానయు నచ్చలంబుమదినాటుకొనంగఁ గపోలమండలీ
దానమిళద్ద్విరేఫనినదంబుల ఘీంకృతి సందడింప వె
ళ్లెనుఁగుమీఁదడీకొలిపియింద్రుఁడు పేంద్రునిఁదాఁకెనుద్ధతిన్.

క. పునరాగతుఁ డగుమఘువుని
గనుఁగొని తనమ్రోల నున్న కామినినెమ్మో
మున దృష్టి నిలిపి మురమ
ర్దనుఁ డి ట్లను హాసగర్భితత్క్రోధో క్తిన్. 19

ఉ. అచ్చరలేమ లెల్ల నగ నాహవభూస్థలిఁ దానుఁ దోడుగా
వచ్చినతద్దిశాధిపతివర్గములుం దల లూడఁ బాఱియు
న్మచ్చటులాస్త్రఘట్టన మనంబున నెంచక ‡నానగండ యై
వచ్చినవాఁడు చూచితివె వాసవునిం గమలాయతేక్షణా! 20

ఉ. చూడుము నన్ను నంచు మధుసూదనుఁ డమ్మరిఁబోసితద్భుజా
క్రోడము గాఁడ నేసిన నకుంఠితుఁ డై సురరాజు కృష్ణు నీ
రేడుశరంబుల న్గగకులేశ్వరు ముప్పదిరెంట నేసెఁ బే
ర్వాడి తదన్యదిక్పతులు గ్రక్కున గంధగజాధిరూఢు లై. 21

చ. అనలుఁడు రెండు మూఁడు యముఁ డాసురనాథుఁడునాలు
గైదు తో,యనిధిపుఁ డాఱు గంధవహుఁ డర్థపుఁ డేడు మ
హేశుఁ డెన్మిదిన్, ఘనవిశిఖంబు లేయ మురఘస్మరుఁ డన్ని
యుఁ ద్రుంచి శార్ఙ్గసం,జనితమహోగ్రభల్లముల జర్జరితాంగు
లఁ జేసె నందఱన్. 22

* లివ్విధింగదనసన్నహనం. †ప్రౌఢో క్తిన్. ‡నానగేడి యై.

ఆ. వేల్పుప్రాని యందు వేడుకపడుకూర్మి
సతులకోర్కి దీర్పఁ జాలి యపుడు
హరియు హరియుఁ బోరి రన్యోన్యజయకాంక్ష
నసురజీవితాపహారశుగముల. 23

క. మురహరబలహరు లిట్లాం
డోరతూపులఁ గప్పఁబడుట నోదవించిరి త
మ్మిరువురఁ గనుఁగొనఁ దివిరెడు
గరుడోరగముఖులకోరికకు విఘ్నంబుల్. 24

చ. అలుఁగుల వట్టమై పొడముసగ్నికణంబులు సోఁకి పైగఱుల్
వాలిసియుఁదొంటివేగముడివోకక్రమంబుననొండొకంటిబిం
జలుగొని త్రోచికొంచు శరసంఘములత్యయముదాఁకువిస్మితా
ఖిలసురసిద్ధసాధ్యముగఁ గృష్ణుఁడు జిష్ణుఁడుఁబోరిసయ్యెడన్.

తే. ఘోరముగ మింటఁ బండిరి గోని జగంబు
నంధముగఁ జేయునిపుపరయంపగములు
నొండొకటి దాఁకి క్రొమ్మంట లొదవి తాము
చూర్ణమై పోవ ముద మయ్యెఁ జూపఱకును. 26

క. అలనాఁటినన్ను మఱచితె
నిలు నిలుమీ తగినయాజ్ఞ నీ కిదె యంచుం
బలుఁగులతేని మహేంద్రుం
డలుఁగులవెనుగూఁటఁ జిక్కునట్టుగ నేసెన్. 27

మ. అలుకం గంసవిభేది నందకముచే నయ్యస్త్రము ల్దుంచి వే
బలుదూపు ల్దృఢముష్టిఁ గూర్చి బలభిద్భద్రేభకుంభంబు వ్ర
క్కలుగా నేసినఁ బోరనం దొరఁగె ముక్తాశ్రేణి పై పై హిమా
చలశృంగావతరన్నభశ్చరధునీచంచత్ప్రవాహాకృతిన్. 28

చ. ఇతని కితండె సాటి యగు నీతని కీతఁడె సాటి వచ్చు నొం
డ్లితరులు నీరిఁబోలఁగలరే యను చారణసిద్ధసాధ్యసం
స్తుతులు సెలంగె నారణము చూచి రణాశనమాని నింగిపైఁ
గుతుకరసాతిరేకమునఁ గుంచియవీచినటించె నయ్యెడన్. 29

సీ. కినిసి బిడౌజుఁ డాగ్నేయాస్త్ర మడరింప
నది శార్ఙ్గి తేజంబునందు డించెఁ
గనలి వృద్ధశ్రవుం డనిలాస్త్ర మేసిన
నది యదూద్వహునూర్పునందు డించె
నలిగి బలారి సౌరాస్త్రంబు నిగిడింప
నది శౌరివలచూడ్కియందు డించె
నదరి యింద్రుండు బ్రహ్మాస్త్రంబు పయి కొల్ప
నది మురాంతకునాభియందు డించెఁ
ఆ. పాకదమనముక్తపాశుపతాస్త్రంబు
హరినిజార్ధతనువునందు డించె
నేమి సేయవచ్చు నీశ్వరుం డఖిలాత్ముఁ
డతని గెల్వఁ దనకు నలవి యగునె. 30

చ. తటిగొనియంతలోనమఘుదైత్యహరుండు మహేంద్రుశింజినిం
గొటనెలతూపునం దునిమి క్రూరతరం బగుభల్ల మొక్కటు
న్నటికినఁ గూలెఁ దద్ఘనఘనాఘనకల్పిత మైనటెక్కియం
బొటలుచునోరుగాలి మొదలూడఁగఁ గూలెడుమ్రానికై వడిన్.

శా. భుగ్నభ్రూకుటిదుష్ప్రేక్షుం డగుచు నాస్ఫోటించుచు న్లోనిరో
షాగ్నిజ్వాలలు బాహ్యనిర్గతము లైన ట్లుత్కటారుణ్యని
ష్మగ్నం బై కనుపట్టులోచనసహస్రం బొప్ప మౌర్వీలతా
భగ్నం బైనశరాస*మున్విడిచి జంభద్వేషి యత్యుగ్రతన్.

* నం బుడిగి జంభ.

చ. కులవసుధాధరావలికిఁ గుంటితనం బొదవించె నెద్ది యా
బలితపుఁగైదువుం గొని సుపర్వకులాగ్రణి వేయుఁగన్నులం
దలకొని కౌస్తుభస్తబకితం బగుశౌరియురంబు సూచిన
న్జలజదళోదరోదకముచాడ్పున నల్లలనాడె లోకముల్. 33

ఉ. వీఁడఁడె వాఁడు దీనిపలు ప్రేటున కోరిచి నిల్చి తేని యం
భోరుహనాభ! యంచు సురపుంగవుఁ డప్పుడు లోకభీకరా
కారత నిల్చి భీతిపరికంపితులై సుర లూహ లేది హా
హారవము ల్ఘటింపఁ గులిశాయుధరాజము బూఁచివైచినన్.

మహాస్రగ్ధర. శతధారాజాయమానజ్వలనముఖశిఖాచ్ఛాదితాభ్ర
స్థలంబై, వితతాభీలధ్వనిశ్రీవిలసన బధిరోద్విగ్నదిగ్వారణం
బై,కృతలోకాలోకముఖ్యాఖిలగిరిచలనక్షీణభూమండలంబై
పతయాళిద్వాదశాత్మప్రఖరతరకరౌపమ్యమైయేఁగుదేరన్.

మ. కని నెమ్మోమునఁ బిన్ననవ్వు దొలఁకం గంసారి నిశ్శంకఁదా
ర్క్ష్యుని నడ్డంబుగఁ ద్రిప్పి వేగ రవితేజోదుస్సహస్ఫూర్తిమైఁ
దను డాయ న్శతకోటిఁ గేల శతపత్రశ్రీ దపఁ బట్టెం గటా
క్షనిరీక్షాగతి నందకత్సరుకిణాంకం బైనహస్తంబునన్. 36

సీ. తలలు వీడంగ విద్యాధరు ల్పఱచిరి
క్రగ్గులకాండ్రైరి ఖచరవరులు
చట్టుపైపోఁక లై చనిరి గంధర్వులు
గరుడులు పంచబంగాళ మైరి
కన్నది గతి గాఁగఁ *గిన్నరు లరిగిరి
పన్నగేంద్రులు పటాపంచ లైరి
పోయినపోక లై పోయిరి సిద్ధులు
దిక్కామొగము లైరి దిగధిపతులు

---

* గిన్నరుల్ మరిగిరి.

తే. హరిహయత్రాణనాయత్తు లగుచు వచ్చి
మునులు సంప్రార్థనావచోముఖరు లైరి
పూని తనమీఁద వచ్చుదంభోళి నిట్లు
పంకజోదరుఁ డోడిసి చేపట్టుటయును. 37

ఉ. ముందల వట్టినట్లు తనముఖ్యతరాస్త్రము గొన్న దేవకీ
నందనుఁ జూచి సాధ్వసమునానయుఁ గ్రమ్మఁగరీంద్రు డిగ్గిసం
క్రందనుఁ డోముకుంద! మురఘస్మర! యేనపరాధి నంచు వే
ముందఱవచ్చి సాఁగఁబడి మ్రొక్కిన శౌరికృపార్ద్రచిత్తుఁడై.

ఉ. లెమ్ము సురేంద్ర! నీవలన లేదొకతప్పును నీమఱంద లి
కొమ్మ వదాన్యభూరుహముఁ గోరినఁ దెచ్చితిఁగాని కొమ్ము నీ
సొమ్మని వజ్రమిచ్చి మధుసూదనుఁ డాతరు వీఁ దలంచినం
గ్రమ్మఱ మ్రొక్కి వాసవుఁడు కందళితప్రమదాంతరంగుఁడై.

ఉ. సొమ్మన నెద్ది యే ననఁగ సొమ్మున కెవ్వఁడఁ గర్త వీవు నీ
సొమ్మఖిలప్రపంచమును శూరకులంబు నలంకరించు నీ
వమ్మహి నుండునంతకు ననన్యదురాపము పారిజాతభూ
జమ్మును నుండు నన్న వికసన్ముఖుఁడై హరి వీడుకొల్పుచున్.

శా. గంధర్వోరగసిద్ధసాధ్యవరులం గారుణ్యదృష్టిక్రియా
సంధానంబున వీడుకొల్పి సురభూజంబు న్సతి న్వాహన
స్కంధాగ్రంబున నుంచి విక్రమకళా*సంలబ్ధతృప్తిప్రియసీ
సంధాసిద్ధఁ గృతార్థుఁడై మఱలె నిచ్చ న్వేడ్కలుప్పొంగఁగన్.

ఉ. వాసవుతోడి కయ్యమున వార్తలు సెప్పుచు మోముదమ్మిను
ల్లాసముమందహాసముఁ దొలంకఁగ వేలుపుమ్రానిపూవులం
జేసినసొమ్ములంగములఁ జేర్చి వధూమణి నాదరించుచున్
వాసుకిభోగతల్పుఁడు సువర్ణగిరీంద్రము దాఁటెఁ జయ్యనన్.

* సంరబ్ధి; సంరబ్ధ.

శ్రీకృష్ణుఁడు పారిజాతముతో నిజనగరి కేతెంచుట.

చ. కనకగిరీంద్రముం గడచి క్రక్కున రైవతకాద్రిప్రాంత ని
ల్చిన యదువృష్ణిభోజనృపసింహులు సేనలతోడఁ దన్నెదు
ర్కొన నగరంబుఁ జొచ్చె మణిగోపురసంస్థితపౌరభామినీ
జనములు సేసముత్తెములు సల్లఁగ నుల్లసితాంతరంగుఁ డై.

తే. పురబహిర్ద్వారములు దాఁటి భుజగశాయి
రాజమార్గంబు దఱియ సేఁరాళి మగుచు
బుగులుకొనియెను *నామోదపూర్వకములు
పారిజాతమహీజాతపరిమళములు. 44

ఉ. ఆమహీజాతముం గనినయంతటిలో ధనధాన్యరాశితో
సానుజ ఘోటికా మహిత శాలలతో మణిసౌధపంక్తితో
గోమహిషీ శతాంగ భట కోటులతో మణిభూషణాలితోఁ
దామరతంపరై తనరెఁ దత్పురిఁ గింపచగేహవాటికల్. 45

మ. బెరసెన్నేన నిగిడ్చినట్లు వళు లుబ్బెస్తుగ్బలాంగంబు లం
కురము లూన్పె రదంబు లంఘ్రులవడంకు ద్రెళ్ళె వాలారులై
కరజంబు ల్సిగిరించెఁ గేశవితతు ల్గప్పారె వృద్ధాలికిన్
మరలం బ్రాయము వచ్చెఁ దత్తరుచలన్మందానిలాసంగతిన్.

క. విన నేర్చిరి బధిరులు గనుఁ
గొన నేర్చిరి యంధకులు లఘుత్వము మీఱన్
జన నేర్చిరి వికలాంగకు
లనిమిషతరుకుసుమసౌరభావేశమునన్. 47

క. విస్మయముగ నీగతి ముర
ఘస్మరుఁడు నికేతనప్రఘాణమున భుజం

* నాఘ్రాణపూర్వ.

గస్మయహారవాహము డిగి
సస్మితముఖుఁ డగుచు నరిగె సమ్మోదమునన్. 48
. వరభక్తి దేవకీవసుదేవులకు మ్రొక్కి
బలభద్రునకు నట్ల ప్రణతి సేసి
గురు పురోహిత బంధుకోటికి వినయంబు
గావించి మిత్రులఁ గౌఁగిలించి
సుత సోద రామాత్యతతినతు ల్గయికొని
యాప్తవర్గంబుల నాదరించి
గారవంబునఁ బెక్కుగతుల మన్నించుచు
వినతాతనూభవు వీడుకొలిపి
తే. ప్రేయసియుఁ దానుఁ గూడి తదీయమంది
రమున కేఁగి సుఖాలాపరచన మెఱయఁ
బ్రతిన వచ్చెఁ గదా యిదె పారిజాత
మనుచు నర్పింప నద్దేవి హర్షమంది. 49

—పారిజాతప్రతిష్ఠ.—

తే. ప్రాణవిభుఁ బెక్కుమాఱులు ప్రస్తుతించి
మందిరారామవాటికామధ్యసీమ
దివిజభూమీరుహంబుఁ బ్రతిష్ఠ సేసి
యర్ఘ్యపూజన మొనరించె ననుదినంబు. 50
చ. సతులఁట ప్రాణనాథులఁట సారెకు నైక్యము లైనమోహసం
గతులఁట యేమి సెప్ప బలఘస్మరు బోర జయించి కల్పక
క్షితిరుహము న్నిజేశ్వరికిఁ గృష్ణుఁడు దానిట దెచ్చె నంచుసం
స్తుతులొనరించిరొండొరులతో సవతుల్వడియాఱు వేవురున్.
సీ. విరివిగా నొకవేళఁ బెరిఁగి వీటికి నెల్ల
నిజశీతలచ్ఛాయ నిగుడఁ జేయుఁ

బిన్నగా నొకవేళఁ బెనుప్రేలియంత గొను
చూడ్కుల కెంతయు వేడ్క సేయు
వింతగా నొకవేళ వివిధభూరుహపుష్ప
సురభిగంధంబుల *సోడు ముట్టు
వేర్వేఱ నొకవేళ వికచకాంచనరత్న
పరిపక్వఫలములఁ బరిణమించు
తే. నభిలషించినరూపంబు నభినయించు
నుల్లమునఁ గోరుకోరిక లెల్ల నొసఁగు
సత్యభామాగృహారామనిత్యమైన
పారిజాతంబు విస్మయాస్పది యగుచు. 52

నారదాగమనము.

వ. ఇవ్విధంబున నభీష్టఫలసిద్ధిసంతోషితస్వాంతులును నిఖిల లోకైకసంస్తూయమానసమనోమహిమోదాత్తులు నై నిరంతరసౌఖ్యవర్ధిష్ణు లగునాసత్యాకృష్ణులను జూచువేడుకం గ్రమ్మఱ నొక్కనాఁడు నిజతనుప్రభాపరిహాసితశారదనీరదుం డగునారదుం డరుగుదెంచి యథాపూజనంబులు సేయు సత్కారంబులం బరితుష్టి నొంది సుఖోపవిష్టుండై యిష్టాలాపసమయంబున నుల్లసితముఖారవిందుం డగుచు నయ్యిందువదనం గనుంగొని. 53

తే. హేమనిభగాత్రి! నీభాగ్య మేమి చెప్ప
జిష్ణుభూజంబు నీపెట్టు చుట్టఁజేసి
సవతులన కాదు త్రిభువనేశ్వరి యనంగఁ
బోలుచు పౌలోమి గెలిచితి వలఘుమహిమను. 54
చ. అతులిత తావకీన మహిమాతిశయోచిత మైనపుణ్యక

*ఁ జోడు ముట్టు.

వ్రత మొనరింపఁగా వలయు వారిజలోచన నీవు నయ్యరుం
ధతియును గౌరియు న్శచియుఁ దత్పరబుద్ధి నొనర్చు వేళఁజూ
చితిమును తద్విధం బెఱుఁగఁజెప్పెద నే నిపుడానుపూర్విగన్.
చ. తెలతెలవాఱ మానినియతి న్నదికిం జని తీర్థ మాడి ని
ర్మలవసనంబు గట్టి నవరత్నవిభూషణము ల్ధరించి మైఁ
గలప మలంది క్రొమ్ముడిని గమ్మవిరు ల్నవరించి యుత్తమా
మలకను నాత్మభర్తకు నమస్కృతి సేసి తదీయసమ్మతిన్.56
చ. కువలయనేత్రి తొంటితనకోపము గర్వము మత్సరంబు మా
ని వినయముం బ్రమోదమును నిండి తొలంకెడు నెమ్మనంబున
న్నవతులయింఁడ్లకెల్లఁ దొలునాఁడు క్రమంబున నేఁగి తద్వ్రతో
త్సవమున కామతించి యతిసంభ్రమలీలలఁ దోడి తేఁ దగున్.
చ. దినదిన మట్లు తత్పరమతిం బదివేవురు పేరఁటాండ్ర క
ర్చన లొనరించి సారఘనసారసుగంధములు న్విచిత్రనూ
తనపటరత్నభూషణ వితానము లిచ్చుచు వేడ్కఁ జైత్రశు
ద్ధనవమి యాదిగా నెల వ్రతం బొనరించినయంత మీఁదటన్.
మ. పరమాచారధురీణు నధ్యయనసంపన్ను న్సుభాకారు శా
స్త్రరహస్యజ్ఞు విశిష్టవంశజుఁ బ్రశాంతస్వాంతు నుదగ్రదయా
పరతంత్రు న్విదితాత్మభూసురవరుం బ్రార్థించి యాచార్యుఁగా
దరళాక్షీ! నియమింపఁగాఁదగు వ్రతోద్యాసక్రియావేళకున్.
శా. ఆరీతి న్నియమించి యీవలయు నాద్యర్ధంతి వాహావళు
ల్నారీత్నచయం బనర్ఘనవరత్నశ్రేణి గోభూపరీ
వారంబు ల్ధనధాన్యసంతతి రసవ్రాతంబుఁ గర్పూరక
స్తూరీసంకుమదాగురుక్రముక రాసులో కోటిసంఖ్యాకముల్.
శా. ఏతద్వస్తు సదక్షిణాకముగ నాత్మేశు న్సురానోకహా
న్వీతుం గాఁదగ ధారవోసి ద్విజుఁడే యేయర్థము ల్వేఁడినం

జేతఁగ ప్రీతిగ నిచ్చి క్రమ్మఱఁ బతిం జేకొంట యుక్తంబు వి
ఖ్యాతం బై తనరారు నీవ్రతము సాకల్యంబుగాఁ జేసినన్.
క. ధన కనక వస్తుసమితియుఁ
దనయసమృద్ధియును గల్గి తానుం బతియున్
మనమున నఱగొఱ లెఱుఁగక
యనితరసులభైకసుఖము లందుదు రనుచున్. 62

పుణ్యకవ్రతము.

క. నారదుఁడు పుణ్యకవ్రత
మారూఢిగ నెఱుఁగఁ జెప్ప నవహితమతి యై
కోరిక లిగురొత్తఁగఁ ద
త్ప్రారంభ మొనర్చె సత్య ధవునియనుజ్ఞన్. 63
సీ. యదు వృష్ణి కుకుర భోజాంధ కాదికముగా
నాత్మకీయం బై నయాప్తగణము
సంబంధు లైనభీష్మకమహీశాదులు
పదియాఱువేలభూపతులకులము
పాండవ కౌరవ పాంచాలు రాదిగాఁ
బరమహితం బైనబంధుసమితి
నందాదిగోపాలబృందంబు మఱియును
నెయ్యు రై వర్తించునృపచయంబు
తే. వారివారలచుట్టము లారిసఖులు
గా జగంబునఁ గల్గిన రాజలోక
మెంత యంతయు సకుటుంబ మేఁగుదెంచెఁ
బుణ్యకాఖ్యవ్రతోత్సవాభ్యుదయమునకు. 64
క. నగముల నదులఁ బయోధుల
దిగంతములఁ గాననముల దీవుల మఱియుం

దగునెడలఁ బుణ్యకవ్రత
జగదుత్సవమునకు వచ్చె సంభారంబుల్. 65

తే. అసురహరునాజ్ఞ రైవతకాద్రిప్రాంత
విస్మయము గాఁగ నిర్మించె విశ్వకర్మ
యాత్మనిర్మాణచాతురి కవధి గాఁగ
మణిమయోజ్జ్వల మగుదానమంటపంబు. 66

సీ. చూడ్కికి ప్రేకమై సురవిమానములచే
గగనమార్గం బెల్లఁ గ్రందుకొనియె
మనుజనాయకవరమకుటాగ్రమణులచే
దిగ్భిత్తు లధికచిత్రితము లయ్యె
నాహూతులైనమహామునీశ్వరులచేఁ
బొడవడ దయ్యె భూభువనతలము
సందర్శనాయాతజనభరంబునఁ గ్రింద
భుగ్నస్ఫటుం డయ్యె భుజగభర్త

తే. సమయబహుముఖముఖరతూర్యములవలనఁ
బద్మజాండంబు ఘోషసంభరిత మయ్యె
సకలలోకమహైశ్వర్యజనక మయిన
పుణ్యకాఖ్యమహోత్సవాభ్యుదయమునను. 67

ఉ. దానవభేది సత్యయును దాను యథోచితవృత్తి మంగళ
స్నాన మొనర్చి శుభ్రవసనంబులు గట్టి యనర్ఘరత్నభూ
షానివహంబు పూని హరిచందనచర్చ వహించి వృద్ధస
భ్యానుమతి న్సులగ్నమున నావ్రతదీక్ష వహించె నయ్యెడన్.

క. వ్రతకల్పోచితదాన
ప్రతిగ్రహార్థముగ నిఖిలపరిషదనుజ్ఞం

గృతనిశ్చయుఁ డై సవినయ
సతిచే సమ్మతిలఁ జేసె నారదమౌనిన్. 69

సీ. మదవతీకరముక్త మణికుంభసంభృత
సౌరభోదకముల జలక మార్చి
హిమధామకిరణవిభ్రమ *విడంబితశుభ్ర
కౌశేయయుగళంబు గట్ట నిచ్చి
ఘనసార†మృగమద గంధ బంధుర మైన
గంధసారము మేనఁ గలయ నలఁది
విస్ఫురర పరిమళ ప్రసవమాల్యంబులు
ఘనజటాజూటంబు మునుఁగఁ జుట్టి
తే. లలిత మణిమయ భూషణావళులు దొడిగి
యిష్టరాజోపచార సంతుష్టిఁ జేసి
ఋత్విజులఁ గాఁగ ధౌమ్యాదిఋషుల నిలిపి
వారిఁ బూజించె సకలోత్సవంబు మెఱయ. 70

శా. భద్రేభంబులమీఁద నెక్కి వెనుకం బ్రద్యుమ్ను లై నేయసా
భద్రాదు ల్నన ధర్మజప్రముఖభూపశ్రేణితో శౌరి తూ
ర్యద్రాఘిష్ఠరవంబు లుష్పతిలఁ జేర న్వచ్చె సంపన్ననా
నాద్రవ్యం బగుదానమంటపము నంతస్సంభృతానందుఁడై.

ఉ. ద్రోవదియు న్సుభద్రయును దోఁ జనుదే విభవాగతాన్యపృ
థ్వీవరకామినీమణులు వేడ్క భజింపఁగ సత్యభామ ము
క్తావినిబద్ధపంజరయుతం బగుపల్లకి యెక్కి వచ్చె వృ
ద్ధావిసరంబు మున్నుగ వ్రతప్రతిపాదనసావధాన యై. 72

* విడంబక. † ఘనసారగంధ; వసుసారగంధ.

ప్రతదానములు.

చ. జలరుహపత్త్రనేత్ర మునిసత్తమవృద్ధసువాసినీజనం
బులు వెనువెంట రాఁ జని*ప్రభుత్వముతో వ్రతదానమంటప
స్థలమున నర్చితంబగువదాన్యమహీరుహ†సార్వభౌమముఖా
వలఁగొని వచ్చి దేవమునివర్యున కిచ్చె యథోచితార్చనల్.

చ. సతులు పదారువేవురును సంగడి రా వదనాంబుజంబునం
గృతకవికాస మచ్చుపడఁ గృష్ణునిపట్టపుదేవి యిందిరా
ప్రతినిధి రుక్మిణీరమణి రాఁ దగ వౌ నని వచ్చెఁ బుణ్యక
వ్రతము గనుంగొనం గమలరాగమణీశిబికాధిరూఢ యై. 74

వ. అట్టియెడ నమ్మహావ్రత దానోచితంబుగా వేర్వేఱ నేర్పరిం
పంబడుసాలంకారధేనుసహస్రంబులు విడు వడు నిజవత్సం
బులం బిలుచునంభారవంబులవలనఁ, బ్రత్యేకంబ పర్వతం
బులుగాఁ గల్పింపఁబడుకనక రజత తామ్ర కాంస్యాదిలోహం
బులుం బద్మరాగ ప్రవాళ హరినీల మౌక్తిక మరకతాది
రత్నంబులుం దిలగోధూమ యవవ్రీహిమాష ముద్గాదిధా
న్యంబులుం గనకనిర్మిత చ్ఛత్త్రచామర శయ్యా వ్యజన పా
దుకాద్యుపకరణంబులుఁ గజ తురగ స్యందనాదివాహనం
బులు మొదలుగాఁ గలుగుదానద్రవ్యంబులు సమకూర్చు
నధికారులసంభ్రమాలాపంబులవలన, నపూర్వమహోత్సవ
సంతోషితస్వాంతు లగుదిగంతమహీకాంతుల పరస్పరసరస
సల్లాపంబులవలన, వివిధదేశాగతంబు లగురాజలోకశుద్ధాం
తవర్గంబుల కెడ గలుగ జడియువేత్రహస్తులతర్జనస్ఫూర్జ
నంబులవలన, సంయమీశ్వర తిలకంబుల వికస్వరస్వరం
బుల నామ్రేడించువేదమంత్రపఠనంబులవలన, వైభవా

* ప్రమోదముతో † సార్వభౌమునిఁ వలగొని మ్రొక్కి.

లోకనలంపటులై యాకసంబున గుంపులుగొని నిలింపు లగ్గిం
చుసంస్తవరవంబులవలనం, బటహభేరీ *ఝల్లర్యాదివాదిత్ర
నాదంబులవలనను, నాదమయం బభ్యర్ణచంద్రోదయఘూ
ర్ణమానార్ణవంబునుం గ్రేణిసేయుచుండె నట్టియెడఁ దత్క
లకలంబు వినివారించి నారదుండు సత్యభామ కిట్లనియె. 75

క. వికచాబ్జనేత్ర! యీపు
ణ్యకవ్రతవిధానమునకు నాథుని ధారా
దక†పూర్వ మీవలయు ని
య్యకొలుపుమా యిప్పుడు యాదవాన్వయతిలకున్. 76

సత్యభామ నారదునకుఁ గృష్ణుని దానమిచ్చుట.

చ. అనవుడు సత్యభామహృదయంబున లజ్జయు సమ్మదంబునుం
బెనఁగొనఁ బ్రాణవల్లభునిఁ బ్రేమరసాలసవీక్షణంబునం
గనుఁగొని మోము వాంచి మధుకైటభమర్దన! చిత్తగించితే
మునిపతిమాటనాప్రభుఁడును మోమునఁ జిఱునవ్వు గుర్వఁగన్.

మ. నవచంద్రాలిక! నీకు నేల యనుమానం బాగమోక్తంబుగా
న విచారింపక ధార వోయు మనిన న్నక్షత్రసత్కాంతులై
సవతు ల్వాంచిరి పత్తిపంకరుహము ల్సంబంధిభూపాలక
ప్రవరు ‡ల్నవ్విరి నర్మగర్భితవచఃప్రాగల్భ్య మేపారఁగన్. 78

చ. మునిపతియానతిం జకితముగ్ధమృగీతరలాక్షి ప్రాణనా, థునిఁ
గనకాంబరాంచలముతోఁ గుసుమాయుధవాగురానిబం, ధ
నమును బోనిక్రొవ్విరులదండఁ దగుల్కొనఁ జుట్టి వేడ్కఁగ
ల్పనగముఁగూడఁ గంకణఝుళంఝుళమంజులదోర్యుగంబునన్

* ఝల్లరీశంఖతుత్తుంభికాదివాదిత్ర; ఝల్లరీశంఖదుందుభ్యాదివాది
త్ర. †పూర్వక మీవలె ని. ‡సల్పిరి...గల్భ్యముల్ మంగటన్.

తే. పరమమునిమానసాలానబంధనమునఁ
గుదురుపడ కుండుయాదవకుంజరంబు
వికచరాజీవనేత్ర చే వేల్పుమ్రానఁ
గమ్మఁబూవులదండచేఁ గట్టువడియె. 80

వ. బలిదనుజేంద్రుఁ గట్టి తని పల్కఁగ వింటిముగాని నేఁడుమా
చెలి యిదెపుష్పదామకముచే నినుఁ గట్టఁగఁ గంటి మింక నె
మ్మెలు పచరింప రా దనుచు మేలము లాడెడుసత్యబోట్లు స
న్నల నెసకొల్పుచుం గెలన నవ్విరి ధర్మజ భీమ ఫల్గునుల్..

మ. సమయజ్ఞుం డయి గర్గసంయమి మహాసంకల్పముం జెప్పఁగ
ల్పమహీజంబు సదక్షిణాకము నిజప్రాణేశుఁ గూడ న్నుపర్వ
మునిశ్రేష్ఠునకిచ్చె దానముగ ధారాపూర్వమవ్వేళఁ 'దు,భ్య
మహంసంప్రదదేనమోనమ' యటం చద్దేవి మోదంబునన్.

ఆ. ధారవోసి మఱియుఁ దద్వ్రతాంగంబుగా
దాన మిచ్చె నపుడు తలిరుఁబోఁడి
మణి సువర్ణ ధాన్యమయపర్వతంబులు
గోసహస్ర వాజి కుంజరములు. 83

క. ఇవ్విధమున దానము గొని
చివ్వలయోగిరపుదపసి చెట్టును గూడం
బువ్వులసరులం జుట్టిన
యవ్విభునిచెఱంగు విడిచి యల్లన నగుచున్. 84

క. సత్యముగ నిన్ను నిప్పుడు
సత్యాసతి మాకు నిచ్చె సకలామ్నాయ
స్తుత్య! యిఁక మా యభీప్సిత
కృత్యంబులు సలుపు మనుచుఁ గేళిపరుండై. 85

నారదుఁడు కృష్ణునిచేఁ బసులుఁగొనుట.

సీ. మేళవించినవి సుమ్మీ దీని మెట్లని
మాంసలాంసంబున మహతిఁ జేర్చి
మిన్నేటిజలము సుమ్మీ తొలంకెడు నని
డాచేత మణికమండలు వొసంగి
యిది జపోచితము సుమ్మీ జతనం బని
వలచేతఁ బద్మాక్షవలయ మిచ్చి
యీశానుఁ డిచ్చెఁ జుమ్మీ మాకు నిది యని
శార్దూలచర్మంబు *ఁ జంకఁ జొనిపి
తే. పొమ్ము పొమ్మని యొక కొంత పోవఁ బోవ
రమ్ము రమ్మని మరలఁ జేరంగఁ బిలిచి
కపటనటనాపరుం డైనకంసవైరి
బరమముని నవ్వటాలకుఁ బసులు గొనియె 86

మ. నిగమాంతప్రతిపాద్యు నాద్యు నభవు న్నిత్యు న్గుణాతీతు వి
శ్వగురున్జిష్ణుయునవ్యయుం బరముని నిశ్శంకం బసుల్గొంచు మా
నిగరిష్ఠుండు కృతార్థుఁ డయ్యె నన సందేహింపఁగా నేల భ
క్తగణాధీనుఁ డనంగ నవ్విభుఁడు లోకఖ్యాతిఁ బెంపొందఁడే.

చ. అపుడు విరించిసూనుఁడు జనార్దను నెయ్యపువాలుఁగంటిఁ జూ
చి పడఁతి నీమనోహరునిఁ జేకొను†మిచ్చెద నంచు బల్కఁ జో
నపరిమితప్రమోదభరితానన యై వెస నిచ్చె వేలుపుం
దపసికి నాత్మభూషణవితానము లన్నియు నిష్క్రయంబుగన్.

క. ఇచ్చి కయికొనియెఁ గ్రమ్మఱ
నచ్చిగురుంబోఁడి విభుని నావైభవమున్

---

* సందిఁ జొనిపి. † మిప్పుడనీకునిత్తునా; మిప్పుడనీకువిల్తునా.

మెచ్చి కుఱియించి రపుడు వి
యచ్చరు లచ్చెరువు గాఁగ నలరులవానల్. 89

చ. తనుతరమధ్య యాగమవిధానము తప్పక యుండ మానిచే
ననుమతిఁ గాంచి మ్రొక్కి వినయంబున నందఱ నామతించిక
ల్పనగముక్రొవ్విరు ల్కనక*పాత్రములందగనించి యిచ్చెవా
యనములు రుక్మిణీప్రభృతు†లౌసవతుల్పదియాఱువేలకున్.

క. ఈచందమున నమానుష
గోచరమహిమాఢ్యుఁ డైనగోవిందుని స
త్యాచంద్రముఖివరు సుర
వాచంయమివరుఁడు చతురవాచాప్రౌఢిన్. 91

నారదుఁడు కృష్ణుని స్తుతించుట.

అనులోమవిలోమకందము.—

నాయశరగసారవికయ
తాయనజయసారసుభగధరధీనియమా
మాయనిధీరధగభసుర
సాయజనయతాయరవిరసాగరనయనా! 92

పాదభ్రమకము.—

క. ధీర శయనీయశరధీ
మారవిభానుమతమమత మనుభావిరమా
సార సవన నవసరసా
దారద సమ తార ‡హార తామస దరదా. 83

గోమూత్రికాబంధము.—

క. విదళితదైత్య రమాగృహ
పదసారస వినతదేవ పతగేశహయా

---

* పాత్రికలం. †లైనసతుల్. ‡తార; తోర.

చిదమిత చైత్యశమావహా
మదవారణ విమతభావమత పాశజయా. 94

నాగబంధము.___

చ. జలదవితాననీల ఖలసాలకులక్షితివారణేశ ని
శ్చలమునివర్యపాల సురచారణయక్షనవానుకూలకుం
డలివరహారలోల నరనారదతత్పర భూవిధేయ యు
జ్జ్వలమనునీతిశీలితవశంవద శక్రరమానికేతనా! 95

ఛురికాబంధము.___

క. శ్రీవర వర పదహృతభవ
భావన వరజాయతేక్ష పాలితవిబుధా
ధావితదనుభవనియమి స
భావనచతురా సముద్ధృతార్ణవవసుధా. 96

చక్రబంధము.___

శా చిత్రాకృత్యభినందితప్రజమృగాక్షీమధ్యగా యుక్షరా
మిత్రోష్ణద్యుతిదిగ్ధచక్ర జనివర్గీకర్ష ణా కృష్ణభా (?)
సత్రారాధ్య నుతింతు నిన్ను జకదీశా విక్రమాతిస్థిరా
రాత్రీ*నాంచితభామితాక్ష సదయా రాధానుభావాకరా.

ద్వ్యక్షరికందము ___

మనమున ననుమానము నూ
నను నీనామ †మనుమనుమననమును నేమ
మ్మున మాన నన్ను మన్నన
మను మను నానాముసీనమానానూనా. 93

---

* శాచిరభామితా. † మును మను; మున మను.

ద్వికందక్రౌంచపదవృత్తము.—

క. అంకురితశ్రీ *సంగభు
జాంకా హరిహయమణిమదహరతనువర్ణా
సంకటకృద్దైత్యాశయ
శంకాజననిజచరిత శయధృతశంఖా! 99

క. పంకజనాభా భంజిత
పంకా పరమపురుష భవపరిభవనామా
శంకరభావా కిసలయ
సంకాశపదయుగ కలశశరనిధిశయనా! 100

భుజంగప్రయాతగర్భస్రగ్విణి.—

†వాసుదేవా ఘనస్వచ్ఛకాంతీ రమా
వాస వంశస్వరవ్యక్తవేదక్రమా
రాసలాస్యప్రకారప్రవీణోద్యమా
వాసవాదిస్తుతవ్యక్తనామా నమః. 101

క. అని చిత్రగతుల నవ్విభుఁ
గొనియాడి మునీంద్రుఁ డరిగె గోపవధూటీ
జనతావల్లభుఁడును మి
త్రనికాయముతోడ నిజపురంబున కరిగెన్. 102

చ. నిజపురి కేఁగుదెంచి ధరణీధరుఁ డప్పుడు భోజరాజ ధ
ర్మజ కురునాథ ముఖ్యమహిమండలనాథులఁ దక్కఁగల్గు బ
న్ధుజనులఁ గల్పకద్రుమజనూతనదివ్యవిభూషణాంబర
ప్రజములొసంగి వీడ్కొని నిరంతరసౌఖ్యరసైకలోలుఁడై.

*సంగభు. †ఈపద్యపాదమునకు 'నమో' యని మొదటఁ జేర్చిన భుజంగప్రయాత మగును.

క. తలిరులతుదఁ జినుకులు జల
జల వడియఁగ దడిసి మెలఁగుచలికరువలి ను
న్వాలపమున విరియుపరువపుఁ
దొలుమొగడలవలపు దెలుపుతోఁటలలోనన్. 104

క. దర దళదంబుజ ముకు ళో
దర దళ మిళ దళికుల చ్ఛదప్రహతి సర
త్సరస రజోధూసర పరి
సర సరసీ తీర కుంజసదనస్థలులన్. 105

క. మరకత గోమేదక పు
ష్యరాగ విద్రుమ విదూరసంభవ ముక్తా
హరినీల వజ్ర కురువిం
ద రత్నమయ కృతక భూమిధర కందరలన్. 106

సీ. భోజకన్యాసరిద్రాజహంసము సత్య
భామాశుకీకేళిపంజరంబు
జాంబవతీనిశాచంద్రోదయంబు కా
ళిందీసరోజినీందిందిరంబు
భద్రాకలాపినీప్రావృడంబువహము సు
దంతారసాలలతాపికంబు
మిత్రవిందావనీచైత్రాగమము లక్ష
ణాహారయష్టికానాయకంబు

తే. షోడశసహస్రకామినీస్తోమధేను
కారిరంసామదోత్కటవారణేంద్ర
మనఁగ సౌఖ్యాంబునిధి నోలలాడుచుండెఁ
గృష్ణుఁ డఖిలావనైకవర్తిష్ణుఁ డగుచు. 107

సీ. కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
సూత్రుఁ డార్వేలపవిత్రకులుఁడు
నందిసింగామాత్యునకును దిమ్మాంబకుఁ
దనయుండు సకలవిద్యావివేక
చతురుఁడు మలయమారుతకవీంద్రునకు మే
నల్లుండు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధఘనచతురంతయా
నమహాగ్రహారసన్మానయుతుఁడు
తే. తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
ఘోరశివగురుశిష్యుండు పారిజాత
హరణ మను కావ్య మొనరించె నంధ్రభాష
నాదివాకరతారాసుధాకరముగ. 108

శా. *ఏకచ్ఛత్త్రితసర్వభూతల నృసింహేంద్రక్షమాభృత్తపః
పాకద్యోతితరూప మౌక్తికతులాభారప్రదానోన్నతా
నేకస్తన్యసమాస్త్రసన్నిభ హరిత్కూలంకషోద్యద్యశః
శ్రీకర్ణాటమహీశ వైరికరిరాట్సింహప్రతాపోదయా! 109

క. భువనవిజయాఖ్యసంస
న్నవరత్నవిభాప్రభాతనలినాప్త రమా
ధవచరణకమలసేవా
ప్రవణమతీ వీరరుద్రపర్వతవజ్రీ! 110

మంగళమహాశ్రీ —
చిత్తజభిదంఘ్రియుగచింతనకళాధిగత
జిష్ణుసమవైభవవిశేషా

* ఏకచ్ఛత్త్రపదావసితల.

విత్తరమణ ణామరగవీ తరణిభూ జలద
    విశ్రుత కరాంబురుహాగోక్షి
నృత్తమణిరంగతలనీతిమను రాజనిభ
    నిర్భరదయారసపయోధీ
మత్తగజయూథమదమగ్న సుఖతాళిరవ
    మాన్యగృహ మంగళమహశ్రీ. 111

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధసారసార స్వతాభినందినందిసింగయామాత్యపుత్ర కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ తిమ్మయనామధేయప్రణీతం బైనపారిజాతాప హరణంబను మహాప్రబంధంబునందు సర్వంబునుంబంచమా శ్వాసము.

పారిజాతాపహరణము సంపూర్ణము.




చెన్నపురి : "వావిళ్ల" ప్రెస్సున ముద్రితము — 1929.

# ఆంధ్రగ్రంథములు.

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:— | | |
| 7 సంపుటముల ప్రతి ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి ... | 13 | 0 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాదిసూర్యనారాయణశాస్త్రి | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు, అత్యుత్తమప్రతి | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు, లక్ష్మణకవికృతము ... | 1 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | 1 | 0 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము. | 2 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు | 3 | 0 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనముమిక్కిలి సొంపు, పీఠిక అతివిపులము ... | 7 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగముద్రితము ... | 0 | 10 |
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 10 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కగ ముద్రించియున్నాము. | 2 | 0 |

ప్రతి 1-కి రూ. అ.

| | | |
|---|---|---|
| వసుచరిత్రవిమర్శనము. శ్రీచినసీతారామస్వామిశాస్త్రికృతము. అత్యద్భుతములగుక్రొత్తవిషయముల నేకము లిందుగలవు | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు... | 4 | 0 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము (అచ్చగుచున్నది) | | |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠికవిపులము | 2 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు ... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు (అచ్చగుచున్నది) | | |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | 1 | 0 |
| హరవిలాసము ,, ... | 0 | 12 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర వేంకటకవికృతము | 0 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవి ... | 0 | 8 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి,నారాయణకవిప్రణీతము | 0 | 8 |
| రామాభ్యుదయము,అయ్యలరాజు రామభద్రకవికృతము | 1 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | 0 | 4 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | 0 | 8 |
| అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తి పంతులుగారి విమర్శతో నున్నది ... | 2 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.